# భారతి

సాహిత్య మాసపత్రిక

జనవరి: 1990 | వెల : 5 రూపాయలు



వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక
*
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)
*
సంపుటము : 67 జనవరి 1990 సంచిక : 1
విడిప్రతిక వెల ఐదు రూపాయలు

## విషయానుక్రమణిక


| | | |
|---|---|---|
| చారిత్రకాంధ్రములో కొన్ని పన్నులు - వివరణలు | డాక్టర్ సి. ఎ. పద్మనాభశాస్త్రి | 5 |
| స్వాంతనము, సూర్యాస్తవము, ఎప్పుడు వచ్చు స్వరాజ్యం? | కైలాసవాసి జనమంచి వేంకటరామయ్య | 11 |
| నన్నతిలో లభించిన అశోకుని శాసనములు | డాక్టరు ఇంగువ కార్తికేయశర్మ<br>శ్రీ పూరి వేంకట శ్రీనివాసరావు<br>శ్రీ రావిప్రోలు వేంకట శివశర్మ<br>శ్రీ జనుముల వరప్రసాదరావు | 12 |
| విశ్రాంతి లేని కళ్లు | ప్రేరణ | 24 |
| మంత్రబలము | శ్రీ గాదేపల్లి కుక్కుటేశ్వరరావు | 25 |
| కళ్ళు | శ్రీ ఏల్చూరి విజయ రాఘవరావు | 28 |
| జానపదుల స్మృతి గీతాలు | డాక్టర్ గుమ్మా సాంబశివరావు | 30 |
| స్మృతుల పరిమళాలు, పారిజాతమే ఓ పదంగా, కలల పట్టుపాన్పు, నేలతల్లి, మౌనరాగం | శ్రీ కొడిమెల శ్రీరామమూర్తి | 34 |
| మేఘసందేశం నాటి సాంఘిక స్థితిగతులు | డాక్టర్ యస్. యల్. యన్. ఆచార్య | 36 |
| భయము | శ్రీ దేవరకొండ సుబ్రహ్మణ్యశాస్త్రి | 40 |
| ధృతరాష్ట్ర కౌగిలి | శ్రీ ఆచాళ్ల శ్రీనివాసరావు | 41 |
| కాలచక్రం | శ్రీ ఏ. సూర్యప్రకాశ్ | 42 |
| ఆంధ్ర శృంగార తిలకము | శ్రీ లలితకవి అల్లంరాజు లక్ష్మీపతి | 44 |
| అక్షర సమామ్నాయము : ఆంధ్ర లిపి | శ్రీ ధూళిపాళ మణిశ్రీ | 47 |
| కలగూరగంప | | 51 |
| గ్రంథవిమర్శలు | | 61 |



# స్వాతంత్ర్య మూల స్తంభాలు



నవంబరు 1వ వారంలో మన పురుషులు
స్త్రీలు యువకులు వృద్ధులు
మిలియన్ల సంఖ్యలో తమ ఓటు హక్కును
వినియోగించుకున్నారు

ఇతరత్ర వీచే పరివర్తనల గాలులలాగే
మన దేశంలో కూడా ప్రజాస్వామ్య రీతిలో
సులభంగా సాఫీగా ప్రభుత్వ పరివర్తన
జరిగింది

9వ లోక్‌సభ ఎన్నికలు మరోసారి
ప్రపంచానికి తేటతెల్లం చేశాయి
స్వాతంత్ర్యం-ప్రజాస్వామ్యం వీటిపై
మనకున్న అచంచల విశ్వాసమే
మన బలమని నిరూపించాయి

ఆ విశ్వాసం ఆ స్వాతంత్ర్య జ్వాలల్నే
మనం పరిరక్షించుకోవాలి





**ప్రజల వాక్కు ఇది**
**జాతి వాక్కు ఇది**

# స్వవిషయం

కర్ణాటకలోని గుల్బర్గా జిల్లాకు చెందిన సన్నతి గ్రామంలో ఇటీవల బయటు పడిన అశోకుని శిలాశాసనాల గురించి డాక్టర్ ఇంగువ కార్తికేయ శర్మ, ఆయన సహ పరిశోధకులు — ఈ నెల "భారతి"లో సవిస్తరంగా, సచిత్రంగా తెలుపుతున్నారు. శాసనాలపట్ల ప్రత్యేకమైన అభిరుచి, ఆసక్తి ఉన్నవారికే కాకుండా- తతిమ్మా భారతి పాఠకులందరికీ ఈ వ్యాసం అత్యంత రుచికరంగా ఉండగలదని మా ఆశ. చారిత్రక పరిశోధకులకు ఈ వ్యాసం ఎంతో ఉపయోగకరంగా ఉంటుందనడంలో సందేహం ఉండదు.

మేఘసందేశం నాటి సాంఘిక స్థితిగతుల గురించి - ఈ మాసం "భారతి"లో ఒక వ్యాసం ఉంది. కావ్య దర్శనం ద్వారా సమకాలీన సమాజ దర్శనం చేయడం చరిత్ర పరిశోధనలో ఒక భాగంగా ఎవరైనా గుర్తిస్తారు. కాళిదాసు తన మేఘదూతంలో వెలుపరించిన వైజ్ఞానిక నాగరిక సమాజం - ఆధునిక సమాజానికి ధీటుగా ఉండడం కొంతయినా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఇదే అభిప్రాయాన్ని వ్యాసకర్త డా॥ ఎన్. ఎల్. ఎన్. ఆచార్య వెలిబుచ్చారు.

చారిత్రికాంధ్రములో కొన్ని పన్నుల గురించి సాధ్యమైనంత సమగ్రంగా ఈ మాసం "భారతి"లో చర్చించడం జరిగింది. అపుత్రికము, పిండికాద్రవ్యము, వడ్డరావుళము, కడ్డాయము - వంటి సుంకాల గురించి డా॥ సి. ఎ. పద్మనాభశాస్త్రి సముచితంగా వివరించగలిగారు. ఈ వివరణలు ఎక్కువమందికి తృప్తిని కలిగించగలవని మా నమ్మకం.

ఈ నెల భారతిలో కైలాసవాసి జనమంచి వేంకటరామయ్య రాసిన పద్యాలు కొన్ని ఉన్నాయి. శ్రీ కావ్యకంఠ గణపతి ముని జీవితంలోని యథార్థ ఉన్నివేశాన్ని "మంత్రబలం"గా అందించిన కవిత్వంకూడా ఈ సంచికలోనే ఉంది. విభిన్న భూమికలను ప్రదర్శిస్తున్న ఆధునిక వచన కవితల్ని కూడా పుష్కలంగా అందిస్తున్న "భారతి" రకరకాల ఆలోచనలకు వేదిక కావాలనేదే మా అభిమతం.

కథా సాహిత్యంపట్ల "భారతి" నిరాదరణ చూపుతున్నదని ఇటీవల కొందరు విమర్శలు చేస్తున్నారు. మంచి కథల కోసం "భారతి" ఎప్పటినుంచో ఎదురు చూస్తున్నది. జీవితమే ఇతివృత్తంగా - చెప్పే తీరులో ఊహాతీతమైన ప్రతిభను కనబరచే-కథల కోసం, కథకుల కోసం - ఆరాటపడనివారు ఎవరు ఉంటారు?

కలగూరగంప వేదికను మరింతగా విస్తరింపజేసి అనేక అంశాలమీద రకరకాల చర్చలకు అవకాశం మరింత ఎక్కువగా కలిగిస్తున్నాము. రాసేవారి, చదివేవారి సహాయ సహకారాలు ఎప్పుడూ ఉండాలని "భారతి" మళ్లీ గుర్తు చేసుకుంటున్నది.

డాక్టర్ సి. ఎ. పద్మనాభశాస్త్రి

# చారిత్రకాంధ్రములో కొన్ని పన్నులు - వివరణలు

'ఆంధ్రదేశము అన్నపూర్ణ' అనే పదము ఈనాటిదే కాదు ఏనాటిదో అని సర్వాంధ్ర జనులకు తెలుసును. సకల సౌభాగ్యములతో, అనేక సంపదలతో తులతూగే ఆంధ్ర ప్రజానీకమునకు బంగారుమయమీ గడ్డ. తరతరాల చరిత్ర చదివినా మరింతగా చదవాలనిపించేదీ చరిత్ర. ఎన్నో వంశములవారు నిపుణతతో, దక్షతతో రాజ్యభారము వహించినారంటే కేవలము వారి రాజకీయ నైపుణ్యమే కాదు, పాలనా చతురత, పటిష్ఠమైన ఆర్థికాలోచనలే కారణము. శాతవాహనుల కాలము నుండి, విజయనగర, మహమ్మదీయుల పతనావస్థ వరకు, ఆంధ్రదేశపు ఆర్థిక చరిత్ర చూసిన, ఆయా రాజవంశములవారి నైపుణ్యత గోచరమగును. శాసనములలో గోచరించిన కొన్ని పనులగురించి ఎందరో చరిత్రకారులు, శాసన సమీక్షలు, నిపుణులు వారి వారి అభిప్రాయములు వివరించినారు. వారందరకు సహృదయంతో కృతజ్ఞతలు తెలియచేసుకుంటూ, నా ఆలోచనలను, అభిప్రాయములను వివరిస్తున్నాను.

## అపుత్రికము, అపుత్రిక ధనము, అపుత్రిక దండము

పై పదములు ఆంధ్ర దేశమునకు చెందిన కొన్ని శిలా శాసనములలో కన్పిస్తూ ఉంటాయి. మొదటిది కళ్యాణి చాళుక్యులకు చెందిన కుమార తైలపుని (చాళుక్య విక్రమ నరుషములు50) ఆవంచ (మహబూబ్‌నగర్ జిల్లా, ఆత్మకూరు తాలూకా) కన్నడ శిలా శాసనములో చూడవచ్చును.[1] కుమార తైలప దేవుడు వ్యాపారస్థులకు కొన్ని సదుపాయములు చేయు సందర్భంలో ఈ పదము చెప్పబడింది.

శ్రీమద్రాజధాని ఆవంచెయ పట్టసాలిగం
త్రైలోక్యమల్ల అంగడిసెట్టిగం జగదేక
మల్ల పాలిశెట్టిగం రాయబంగార మాడి
శెట్టిగం వీరనొళంబ సమయక్కెం
అల్లియ సమస్త ప్రజెగం కారుణ్యం గెయ్దు
శిలాశాసనమా చంద్రార్కతారంబరం
అపుత్రిక ధన మం కొళ్లదం త్తాగియుం, క
శత్రమం హొదర మంత్రతియిల్ల దహిడి
యదం త్తాగి యుం.........

పై శాసనములో ఆవంచలో నివసించెడి కొంత వ్యాపారులకు, సమయాలకు, సమస్త ప్రజలకు కూడ అపుత్రిక ధనమును తీసుకొన్నవారు, భార్యను జారత్వమునకు ప్రోత్సహించినవారగుదురు అన్న భావనలో రాసినట్టుగా ఉంది.

గుంటూరు జిల్లా మోటుపల్లిలో లభించిన అనవోతారెడ్డి శిలా శాసనములలో (తెలుగు శాసనం, తమిళ శాసనంలో కూడ) ఈ పదము కనిపిస్తుంది.[2] ఈ రెండు శాసనములు శక సంవత్సరం 1280 (క్రీ.శ. 1358)లో ఇవ్వబడింది. తెలుగు శాసనంలో-

పరదెసి వ్యవహారులకున్ను అపుత్రికమున్ను
కడ్డాయమున్ను మానితిమి బంగారు సుం
కము మానితిమి గంధము పసుపు
సుంకము పూర్వాజ మరియాదలోను మూంట
మ ఒకటి మానితిమి తక్కిన సరకులకు
మడి సుంకము.........అని ఉంది.

అదే సంవత్సరంలో ఇవ్వబడ్డ తమిళ శాసనంలో[3]

పరదేశి గలుక్కుం అపుత్రిక దండం
కొళ్ళక్కడురమ్.........అని కలదు.

పై శాసనములను బట్టి చూస్తే, ఈ అపుత్రికము, అపుత్రిక దండం, అపుత్రిక కధనము పదములు కేవలం వ్యాపారుల కోసం వేయించినట్టుగా తెలుస్తోంది. ఉత్తరదేశ శిలాశాసనములలో అపుత్రికవేణి, అపుత్ర, అపుత్రిక, అపుత్రికధనము, అపుత్రికా ధనము మొదలయిన రూపాలతో కనిపిస్తుంది. అపుత్రిక మనగా సంతానము లేకపోవుట అనే అర్థం స్ఫురిస్తుంది. పరదేశి వ్యాపారులు ఈ దేశానికి వచ్చి, వ్యాపారాభివృద్ధి గావించుకొని స్థిర పడినపుడు, వారు హఠాత్తుగా మృతి చెందినపుడు వారి ఆస్తిపాస్తుల విషయంలో ఈ పదము ఉపయోగించబడింది. 'అపుత్రికవేణి'

యందు 'వేణి' అనుదానికి నిఘంటుకారులు 'విడిపోయిన ఆస్తిని తిరిగి కలుపుట'గా చూపించినారు. బహుశ 'అపుత్రికవేణి' అనగా సంతానహీనుడైన వాని ఆస్తి అనే అర్థం తీసుకోవటానికి వీలవుతుంది. కౌటిల్యుడు తన అర్థశాస్త్రములో[4] సంతానహీనుడై మృతి చెందినవాని సంపద ప్రభుత్వ పరమగునని వచించాడు. అటువంటి ఆస్తిని ప్రభుత్వమే రక్షించాలి అని బోధాయన సూత్రంలో కలదు.[5] మను ధర్మశాస్త్ర ప్రకారం పైన చెప్పబడి నటువంటి ఆస్తిని, రాజు (ప్రభుత్వము) మూడు సంవత్సరాల వరకు నిలువచేసి, ఆటు తరువాత దానిలో ఆరోవంతుగాని, పదోవంతుగాని, పన్నెండవ వంతుగాని తీసుకొని, హక్కుదారులు తెలిసిన తరువాత వారికి ఇవ్వవలెను.[6] కాని బృహస్పతి ధర్మశాస్త్ర ప్రకారం[7], పైన చెప్పిన ఆస్తి శూద్రునిదైన ఆరో వంతును, వైశ్యునిదైన తొమ్మిదో వంతును, క్షత్రియునిదైన పన్నెండో వంతును, బ్రాహ్మణునిదైన ఇరవయ్యో వంతును ప్రభుత్వ పరమగును మిగిలినది హక్కుదారుల పరమగునని చెప్పాడు. ఒకవేళ హక్కుదారులు ఎవరూ లేరని నిర్ణయించబడితే, బ్రాహ్మణేతరుల ఆస్తి ప్రభుత్వ పరమగునని, బ్రాహ్మణుల దయిన తోటి బ్రాహ్మణునకు చెందునని బోధాయన సూత్రంలో చెప్పబడింది. పైన చూపబడిన శాసనాధారములను బట్టి సందర్భానుసారముగ, పై ఆస్తి వైశ్యులకు సంబంధించినదిగా చెప్పుకోవటానికి ఆస్కారముంది.

పిండికాద్రవ్యము

కడప జిల్లాలోని పుష్పగిరి ఇంద్రేశ్వర స్వామి గుడి యందు గల రెండు శాసనములలో[8] పిండికాద్రవ్య సహితముగాను అను పదము కనిపిస్తోంది. ఆంధ్రదేశ శిలా శాసనములలో ఈ పద ప్రయోగం అపురూపమని చెప్పవచ్చు. మొదటి శాసనము శక సంవత్సరము 1182, రౌద్రి సంవత్సరమున ఫాల్గుణ మాసము బహుళ దశమి శుక్రవారము (క్రీ.శ. 1261, ఫిబ్రవరి 25) నాడు ఇవ్వబడింది. రాజవంశముగాని, రాజు పేరుగాని శాసనములో లేదు. ఇంద్రేశ్వర స్థానాపతులు ఈశ్వరజియ్య, ఎఱనాని, బూమెను, మరొకరు (పేరు లేదు), తమ తమ పాలులో వచ్చిన ఇంద్రేశ్వర దేవర వృత్తులలోను, నూతులలోను, బావి యందును (నూతులు, బావులు అని విడి విడిగా చెప్పుట గమనార్హము), మడిలోను, ఊరిలోను, పిండికాద్రవ్యములోను మొదలయిన పర్యాయములోను వచ్చిన సుమారు నూరు గద్యాణములు, తోడిపాలి పెదమల్లిజియ్యలు, పినమల్లిజియ్యల అనుమతితో పంచమఠ స్థానంవారి ముందట, బట్టి బయ్యేజియ్యలకు, దేవప్పకు, మహేశ్వరునికి అమ్మిరి. ఈ అమ్మకమునకు సాక్షులు స్థానాపతులు, జియ్యలు.

రెండో శాసనము[9] శక సంవత్సరము 1225, శోభకృత్తు సంవత్సరము, శ్రావణమాస, శుక్లపక్ష దశమి, శుక్రవారము (క్రీ.శ. 1302, ఆగస్టు 3వ) ఇవ్వబడినది. ఇది కూడ క్రయ శాసనమే. ఇనంగలూరి ప్రోలజియ్య మనుమడైన భైరజియ్యలకు, ఇంద్రేశ్వర స్థానాపతులైన అంన్నామలజియ్య కుమారుడు దేవజియ్యలు, తనకు చెందిన ఇంద్రేశ్వర దేవర, సోమనాథ దేవర గుడి వృత్తులయందును, కొత్తూర్లు (కొత్తూరు?) లోని మడియందు వచ్చే వృత్తులయందును, పిండికాద్రవ్యము నందును, తన తాత ముత్తాతల కాలమునుండి, వీటిద్వారా లభించుచున్న అయిదు పాలు వృత్తులలోని అర్ధభాగమును మూడు వందల ఇరవై పణములకు జ్ఞాతుల అనుమతితో అమ్మివేసెను. 'పిండికాద్రవ్యము' అను పదము ప్రస్తుతం చర్చనీయాంశము. కౌటిల్యుని అర్థశాస్త్రములో[10] పిండకర అనే పదము రాష్ట్రం మొత్తానికి చెందే శిస్తుగా చెప్పబడింది. అర్థశాస్త్ర వ్యాఖ్యాత భట్టస్వామి[11] 'పిండకర' మొత్తం గ్రామానికి చెందే పన్నుగా మాత్రం భావించవలసి ఉన్నది అని చెప్పాడు. అందువల్ల వ్యక్తిపన్ను, ఆదాయ పన్ను అని కాకుండా, గ్రామానికి మొత్తానికి చెందే పన్నుగా భావించటానికి వీలవుతుంది. కాని ఈ రెండు శాసనములను ఆమూలాగ్రంగా శోధన చేస్తే మరొక అర్థం స్ఫురిస్తుంది. ఈ రెండు శాసనములు క్రయ శాసనములని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చును. దాతలు వారివారికి తరతరాల ద్వారా సంక్రమించిన హక్కులను అమ్మివేయటం గమనించవచ్చు. వారికి వివిధ స్థలాలలో సంక్రమించే హక్కులను, పిండికా ద్రవ్యములను అమ్మివేయటం జరిగింది. ఈ పదము తరువాత 'తన తాత తండ్రి తరమున చెల్లె' అను పదమువల్ల, బహుశః పిండికా ద్రవ్యము, వారి వారి కుటుంబాలకి చెందు వంశపారంపర్య హక్కుగా నిర్ణయించటానికి మాత్రమే వీలవుతుంది. పిండికా ద్రవ్యము, పిండ, పిండి (అనగా వంశపారంపర్యమునే సూచిస్తుంది) అను పదమునకు పర్యాయపదము కావచ్చును.

అయిరాని రూక - కులోత్తుంగచోడుని సామంతుడైన పన్నమణ్ణయ రాజుని నాదెండ్ల శిలాశాసనము[12] (శక సంవత్సరం 1061) నందు 38-39 పంక్తులలో

నాదిండ్లం బె[ం]డ్లి సేసినవారు కొ[డు్క]
వారు గద్యానమును [నడుపున] అయిరాని

> రూకను విద్యామంతులకు పూజారి(కి) అం
> నట్టువుల దాదబోజు మల్లెక [ల]……అని
> కలదు.

చాలమంది పరిశోధకులు అయిరావి రూకను పెండ్లి సుంకముగానే పరిగణనలోనికి తీసుకున్నారు. కారణం నాదిండ్లం పెండ్లి చేసిన వారు, కొడుకువారు అని ఉండటంమూలాన కావచ్చు. దేవాలయాల యందు వివాహము చేసేటప్పుడు కొంత రుసుము చెల్లించవలసిన బాధ్యత ఇప్పటికీ కలదు. చారిత్రక కాలంలో దేవాలయం ఒక సంస్థ. అందులో చాలమంది ఉద్యోగులు ఉంటారు. వారికి ఉపాధి కల్పించవలసిన బాధ్యత దేవాలయంది మాత్రమే అవుతుంది. వివాహాది కార్యక్రమములు నిర్వహింపదలచినవారు ఆలయోద్యోగు లకి కూడ కొంత సొమ్ము చెల్లించవలసి వస్తుంది. ఈ ఉద్యోగు లలో పూజారులు, స్థానాపతుల దగ్గరినుండి, నట్టువులు, సానులు, నీళ్లబిందె మోయువారు కూడ ఉంటారని శాసనాలవల్ల తెలుస్తోంది. పై శాసనంలో విద్యామంతులు అంటే బహుశః శాస్త్రవేదులు కావచ్చును. అయితే అయిరేని రూక అంటే ఏమిటో మరింత విపులంగా తెలుసుకోవలసిన అవసరం ఎంతయినా వుంది. చేమకూర వెంకటకవి వ్రాసిన 'విజయ విలాసము'లో—

> 'ఐరేని గొనివచ్చి రైదువల్ పాటలు పాడుచు
> శుభవేళ వేదు కలర….'' అని కలదు.

కోటి వెంకనార్యుని కృతమైన అచ్చ తెనుగు నిఘంటువు శ్రీ ఆంధ్ర భాషార్ణవములో[13]

'ఘట విశేషంబు లైరేని కడవలనగ….' అని కుండలకు మరొక పేరుగ చెప్పారు. కూచిమంచి తిమ్మనకవి ప్రణీతమైన అచ్చతెలుగు రామాయణం, అయోధ్యాకాండం, నీలాసుందరి పరిణయ మను[14] భాగమునందు-

> రెక్కరాయుడు దిమిమీటి రేవెలంది,
> పెండ్లియగునని కదియము పేరంటాలు మోపి
> యిరేని నీటికి ముంచు ఎపిడి కుండయను
> ట్రొట్టి యుక్కిటి [illegible]'

అని కు ఎలుని వర్ణించాడు.

సూర్యరాయాంధ్ర నిఘంటువు[15]నందు ఐరేని లేక అయిరేని అనే పదమునకు వివాహవేదిక యందు నిలుపు చిత్రిత జలపూర్ణ ఘటము, ఐరేన పనిచేసిన పెండ్లికుండలు అనే అర్థము కలదు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు ప్రచురించిన ఆంధ్ర క్రియా స్వరూప మణిదీపిక[16] యందు ఐరేవ, ఐరేన పూయు అను పదమునకు రంగు పూయుట అనే అర్థము గోచ రిస్తోంది. అంటె అయిరేని - అయిరావి - ఐరేని అనగా రంగులు పూసిన కుండలు అని అర్థం చెప్పవచ్చును. వివాహవేదికయందు నిలుపు చిత్రిత పూర్ణఘటములని అనుకోవటానికి ఆస్కార ముంది. శాసనములో వచ్చిన అయిరేని (అయిరావి)కి ఇదే అర్థం చెప్పవచ్చును. అయిరేని రూక అనగా, చిత్రిత పూర్ణ ఘటముల కిచ్చిన రూక, అనగా రంగు వేసిన కుండలకు ఇచ్చి నటువంటి రూక అనే అర్థం వస్తుంది. పెండ్లి చేసినవారు, పెండ్లికొడుకువారు ఈ కుండలకుగాను ఇచ్చిన రూకలను అయిరేని రూక, అయిరావి రూక అని పిలుస్తారు కాని పెండ్లి చేసినందుకు, దేవాలయములో నిచ్చిన సుంకంపు రూక అని మాత్రం కాదు.

### వడ్డ రావులకము, బీరనము, బీరణాలు

సుమారు పదకొండు - పన్నెండు శతాబ్ది శాసనముల నుండి వడ్డరావుళము, వడ్డరావుళ సుంకము, వడ్డరావుళ సుంకాధికారి, బీరనము, బీరణాలు అనే పన్నులు ఆంధ్రదేశ చరిత్రలో కనిపిస్తూ ఉంటాయి. ఈ పన్నులను భూమి శిస్తుకు సంబంధించినవిగా కొంతమంది ఊహించారు. ఈ పన్నులకు, భూమి శిస్తుకు గల సంబంధమేమిటో చెప్పలేదు. క్రీ.శ. 1147వ సంవత్సరమునకు చెందిన పెదకొండూరు[12] శిలా శాసనములో ఈ పన్నులు కనిపిస్తాయి.

> శ్రీమన్మహామండలే[శ్వ]ర [కు]లోత్తుంగ్గ చో
> డ గొంకరాజుల ము[దిపెలి యా]సన పెగ్గడ
> పల్లినాంటిలో [సుం దమ]కు నడిచెదు [వడ్డ
> రావుళము] పాలును!!

కులోత్తుంగచోడుని ముదుసలి యాశాసపెగ్గడు తనకు పల్లినాగునుండి లభించెడి వడ్డరావుళములోని కొంత పాలును సమ ర్పించినట్లుగా తెలియవచ్చుచున్నది. ఇదే శాసనములో (22వ పంక్తినుండి)

…నా[యిూ]రి ఎలయిు చుట్టులోనం [బుట్టు] పెు [illegible] [ ] పడ్డరావుళము [బీర] [ణాలు] బోడ్డ భీమా [illegible] పిన [illegible] [ ] [illegible] తెల్ల పన్న కట్ట పరిహారముగా నా[బు]ద్రాక్కముని నడిచునట్లుగా విచ్చితిమి ..

కొంకరాజుల ముసలి దేవరాజ ఎలయన పెగ్గడ, బయ్యన పెగ్గడ, ఒతన, బొల్లన మొదలైనవారు కొదమగూడ అశేష మహ జనాలకు పైన చెప్పిన పన్నులన్నియు, కొదమగూడ అగ్రహారములోని ఉపభోగములకు, అఖండ దీపములకు,

నై వేద్యములకు, సన్యాసులకు, విద్యార్థులకు సర్వకాలములందు నడిపేటందులకు దానము చేసినారు. వర్ధరావుళము వీరణాలు పన్నులలో వీరణ 7 వీరనము, వీరములోనుంచి ఉద్భవించినది. కాకతీయ శాసనాలలో వీరణాలు, వీరపన్ను, వీరులపన్ను తరచుగా చూడవచ్చును. బహుశ వీరులకు (సైనికులకు) వారి సేవలను వినియోగించుకోటానికై విధింపు పన్ను కావచ్చును. డా॥ కె. వి. రమేశ్ 'సాధనె' అనే కన్నడ సారస్వత పత్రికలో "వర్ధరావుళ-బిల్కోడె" అను వ్యాసములో[18] 'వర్ధరావుళ' అనే పదము 'వృద్ధరావుత' అను పదములోనుండి వచ్చినదని, వర్ధరావుళ - వృద్ధరావుత - వృద్ధరాజుల కావచ్చునని వివరణ యిచ్చారు. దీనిప్రకారము వృద్ధరాజుల పోషణ కొరకు సమీకరించిన సొమ్ము అనే అర్థం వస్తుంది. ఈ సొమ్ము సేకరించటానికై 'వృద్ధరావుళ సుంకాధికారి' పదవి సృష్టీకరించటం జరిగి వుండవచ్చు. పైన ఉదహరించిన శాసనము గల ఊరు పేరుకూడ గమనింపదగినది. పెదకొదమగుండ్ల అని పేరు. పెద-పెద్దలో నించి వచ్చింది పెద్ద అనే పదము వృద్ధకి ప్రతిరూపం. పెద్ద కొదమ అనగా పెద్ద సింహాలు అనగా ఇది సాహసానికి మారు పేరు. అంటే శౌర్యానికి ప్రతిరూపమయిన శూరులు, సైనికులకు వర్తిస్తుంది. పెదకొదమ గూడ బహుశ వృద్ధ సైనికుల లేక వృద్ధ సైనికుల స్థావరం కావచ్చు. అచ్చటనుండి వసూలు చేసే సొమ్ము వృద్ధరావుళము. దానికి తోడు వీరనము, వీరపన్ను, వీరుల పన్ను మున్నగువాటితో చేకూర్చటం గమనింపదగిన విషయం. దీనివల్లన చారిత్రక కాలంలో, ఆంధ్రదేశములో నివృత్తులయిన సేనానాయకులకు, శూరులకోసం సమీకరించే పన్నులు ఈ వృద్ధరావుళము, వీరపన్ను, వీరనము అని తెలుస్తోంది.

ఒహరు

క్రీ శ. 1195వ సంవత్సరమునాటి పిల్లలమర్రి[19] శిలా శాసనములో 'నొహరు' అనే పదము రెండుసార్లు ప్రయోగింపబడింది. డా॥ మారేమండ రామారావుగారు,[20] డా॥ గోపాలరెడ్డి గారిప్పరు కూడ దానిని నొహరుగానే చదివారు. శాసన పాఠములో

శ్రీ నామేశ్వర దేవరకు అంగరంగ
భోగార్థనమై నాగులవాంటి విశ్వనాధ
సముద్రమునందు నామెరెడ్డి ఇరుగారుం
బంట నొహరి లేకుండాను మఖుతులు
ఎనిమిది । అంద విశ్వనాధయ్యకుం
బుణ్యముగా ఇరుగారుం బంట నోహరి
లేకుండాను ఇచ్చిన మఖుతులు.........

అని గలదు. ఇచట 'ఇరుగారుంబంట నొహరి లేకుండాను' అనుదానిని 'ఇరుగారు బంటన్ ఒహరి లేకుండాను' అని చదివిన చదువు తొలగును. ఇరుగారు, ఇరుకారు అనగా 'రెండు పంటలు' అన్నదిన్ను ప్రసిద్ధమే. పై వాక్యమునకు అర్థము రెండు పంటలకు పన్ను విధించకుండా అనే అర్థము స్ఫురిస్తుంది. బహుశ ఇది భూమి కస్తుకినంబంధించినదై ఉంటుంది. కాని ఒహరుకు కావలివాని పన్ను అని డి. సి. సర్కారుగారు ఇండియన్ ఎపిగ్రాఫికల్ గ్లోసరీ'లో చూపించారు.

ఓఢ్ర (ఒరిస్సా) దేశము నేలిన నాలుగవ నరసింహుని సిద్ధేశ్వర శిలా శాసనములో 'దండాసి బహారు' అని కలదు.[21] డా॥ రామచంద్రరావుగారు 'దండాసి'ని గ్రామ కావలివానిగా గుర్తించి, 'దండాసి బహారుని' తలారి పన్నుగా నిర్ణయించారు. కాని ప్రస్తుత శాసనములో 'ఇరుగారుంబంటన్ నొహరు' అని యుండుట వలన పై నిర్ణయము ఈ సందర్భమునకు సరిపోదు. అందువలన రెండు పంటలపై వచ్చే రాబడి పన్నుగా నిర్ణయించటానికి వీలగుతుంది. అంటే రెండు పంటలపై వచ్చే రాబడి పన్నును 'మాఫీ' చేసినట్లుగా తీసుకొనవచ్చును.

కడ్డాయము, ఖడ్డాయ, ఖడ్డాయము, ఖట్టిగ

ఆంధ్రదేశ శాసనములు సంబంధించినంత వరకు పై పదములు రెడ్డి, విజయనగర కాలము నుండి కనిపిస్తున్నాయి. డా॥ నేలటూరి వేంకట రమణయ్యగారు 'స్టడీస్ ఇన్ ది థర్డ్ డైనాస్టీ ఆఫ్ విజయనగర' గ్రంథములో ఈ పదముల అర్థము భావి పరిశోధకులకు వదిలివేసారు.[22] కాని వారు ప్రఖ్యాత చరిత్రకారులు రైస్, విఘంటుకారులు కిట్టెల్ అభిప్రాయములను తమ గ్రంథములో పొందుపరిచారు. రైస్‌గారి అనువాదం ప్రకారం ఇది 'ఫైన్' 'దండను' అని, కెట్టెల్‌గారి ప్రకారం, 'ప్రజలచేత బలవంతముగా కొన్ని వస్తువుల మీద కట్టించేటి ఒక విధమగు పన్ను అని వేంకట రమణయ్యగారు రాసారు. క్రీ.శ. 1358న ఇవ్వబడిన అనవోతారెడ్డి మోటుపల్లి తెలుగు[23] మరియు తమిళ[24] శిలా శాసనములలో పైన చెప్పిన అపుత్రికముతోపాటు కడ్డాయము పన్ను కనిపిస్తోంది.

.........పెట్టము పరదేసి వ్యవహా
రులకును అపుత్రికమున్ను [క]డ్డాయ
మున్ను మానితిమి బంగారు సుంకము
మానితిమి.. ....

రెండవ దేవరాయుని శ్రీరంగ తామ్ర శాసనమునందు[25] (క్రీ.శ. 1434), దేవరాయుడు త్రిసిరాపల్లి రాజ్యమునందు గల చోళమండలమునందును గల అయిదు గ్రామాలను కాశ్యప గోత్రు

డైన పెరుమాళు ఉత్తమకంచికి ధారపోసినట్లుగా కలదు. పైన చెప్పిన గ్రామాలు కావేరీ నది దక్షిణ తీరమునందు గలవు. ఈ గ్రామాలనుండి లభించు అనేక పన్నుల గురించి ఈ శాసనము నందు గలవు. ఉదాహరణకి వాసల్‌వారి,

తఱిక్కడమై (చేనేత మగ్గముల పన్ను); మార్కడైమై (వృక్షముల మీద పన్ను); కడ్డాయము మొదలయినవి కలవు. కడ్డాయము, ఖడ్డాయము, గడాయము, కట్టిగ మొదలయిన పదములు దాదాపు తీరప్రాంతములందు లభించు శాసనములందు కన్పించుట గమనార్హము. దీనివలన ఈ పన్నుకు, వ్యాపార విశేషములకు ఏదయినా సంబంధ ముండవచ్చును. తమిళమునందు కట్టాయము గలదు. కట్టు పదవలకు సంబంధించినది అని తమిళ నిఘంటువు చెపుతోంది. కట్టు - ఆయము - పదవలనుండి లభించు ఆదాయము. బహుశ ఇది వ్యాపారస్తులు తమ పదార్ధములు తీసుకొని వచ్చినపుడు, చెల్లించు పన్ను కావచ్చును. పైన చెప్పిన శాసనాధారముల మూలంగా కడాయము, ఖడ్డాయము, కట్టిగ మొదలైనవి తీర ప్రాంతములందు వ్యాపారస్తులు తమ పదార్థములను వ్యాపారార్ధము తీసుకొని వచ్చునపుడు చెల్లించు పన్ను అని చెప్పటానికి ఆస్కారముంది. క్రీ.శ. 1494 సంవత్సరపు మెహబూబ్‌నగర్ జిల్లాలోని మనపూర్ శిలా శాసనములో[26]

సహాయమను మొదలు.........సనపేట యేటిదాంకాను దేవవిరాళం గడెం పిద్దాయం వెటి వేంమి.........నవన్‌మున్న ........ ఇందులో గడెం బహుశ

గడెం < ఖడెం < ఖడ్డాయ < కడ్డాయము < కట్టాయములో నుండి వచ్చియుంటుంది.

## సూచికలు :


1. తెలంగాణా శాసనములు, వాల్యూం-2, పే. 60-61.
2) సౌత్ ఇండియన్ ఇన్స్‌క్రిప్షన్స్, వాల్యూం-10, శాసనపు సంఖ్య-556.
3) సౌత్ ఇండియన్ ఇన్స్‌క్రిప్షన్స్, వాల్యూం-26, శాసనపు సంఖ్య-635.
4) అర్ధశాస్త్రము, భాగం-2, చాప్టరు-6.
5) బోధాయన సూత్రం, చాప్టరు-1, భాగం-10, సూత్రం-6.
6) లాస్ ఆఫ్ మను, 'సేక్రెడ్ బుక్స్ ఆఫ్ ది ఈస్ట్' వాల్యూం-25, పే-256.
7) నారదీయ అండ్ బృహస్పతీయం, 'సేక్రెడ్ బుక్స్ ఆఫ్ ది ఈస్ట్', వాల్యూం-33, చాప్టరు-14, పే-336.
8) ఇన్స్‌క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, కడప డిస్ట్రిక్ట్, వాల్యూం-1, పే-197.
9) పై వాల్యూం, పే-223.
10) అర్ధశాస్త్రము, భాగం-2, చాప్టరు-15, సూత్రం-3.
11) కె. పి. జయస్వాల్ - భట్టిస్వామిస్ కామెంటరీ ఆన్ కౌటిల్యాస్ అర్ధశాస్త్ర
12) సౌత్ ఇండియన్ ఇన్స్‌క్రిప్షన్స్, వాల్యూం-10, శాసనపు నెం-107.
13) ఆంధ్ర భాషార్ణవము, పే-89.
14) నీలాసుందరి పరిణయము, పే-379.
15) సూర్యరాయాంధ్ర నిఘంటువు, పే-885.
16) ఆంధ్ర క్రియాస్వరూప మణిదీపిక, పే-776.
17) సౌత్ ఇండియన్ ఇన్స్‌క్రిప్షన్స్, వాల్యూం-10, శాసనపు నెంబరు-119.
18) సాధనె (కన్నడ), వాల్యూం-1, పార్టు-2, పే-78.
19) తెలంగాణా శాసనములు, వాల్యూం-1, నెం-7.
20) జర్నల్ ఆఫ్ ఆంధ్ర హిస్టరీ అండ్ కల్చర్, వాల్యూం-1.
21) ఎపిగ్రఫియా ఇండికా, వాల్యూం-29, పే. 50-51.
22) ది థర్డ్ డైనాస్టీ ఆఫ్ విజయనగర, వాల్యూం-3.
23) సౌత్ ఇండియన్ ఇన్స్‌క్రిప్షన్స్, వాల్యూం-10, శాసనపు నెం-556.
24) సౌత్ ఇండియన్ ఇన్స్‌క్రిప్షన్స్, వాల్యూం-26, శాసనపు నెం-635.
25) ఎపిగ్రఫియా ఇండికా, వాల్యూం-18, పే-139.
26) సెలెక్ట్ ఎపిగ్రాఫ్స్ ఇన్ ఆంధ్ర, శాసనపు నెం-18, 27, పే-75.

# *సాంత్వనము

చిక్కి దోవను పయనంబు జేరు పాంథు
డెండ దాకంగఁ జెట్టుల యండ జేరె
వాన మొదలంగ నొక యింటి పంచ నిలిచెఁ
బిడుగు మొత్తంగ నింకఁ జెప్పెడిది యేమి?

ఇంత వాడంతవాడయ్యె నీకు కృపను
ఇల్లు నిలబెట్టు నా ముప్పు వెళ్లబెట్టు
ననుచుఁ దలపులు వ్యర్థమయ్యె
నకట! వ.సు.రాయనికిఁ బుత్రు డస్తమింప

ప్రార్భ మనుభవింపక
తీరునె యెవ్వరికైన ధృతి తలగక యీ
ఘోర తరం పుత్రశోకపు
వారిధిఁ దరియింపనయ్య వైరాగ్యతరిన్

---

* ఈ కావ్యము శ్రీ వడ్డాది సుబ్బారాయుడుగారి (వ.సు. రాయ కవి) ప్రియపుత్రుడు ప్రహ్లాదమూర్తి అకాల మరణము సందర్భమున వ. సు. రాయకవికి పంపినవి. 1-11-1907 ఆంధ్రకేసరి పత్రికలో ప్రచురింపబడ్డవి. ఈ కావ్యమునే పురస్కరించుకొని వ.సు రాయుడు వ్రాసిన "సుతస్మృతి" అనే స్మృతి కావ్యములో ఈ క్రింది పద్యములో వాపోయినారు.

---

జనమంచ న్వయజుండు, మత్ప్రియతమచ్ఛాత్రుండు, సన్మాలతిన
దెనుగుం జేసిన దంట, భావ గురుతల్ దీపింప, నన్ దెల్పుచున్
జిన పద్యంబులు మూడు కేసరని వ్రాసెన్; జెంతలేవింక నె
వ్వని కేనిట్టి విశేషముల్ దెలుపుదున్? ప్రహ్లాద! ఏకాత్మజా!

# సూర్యస్తవము

కుదురై నిల్చి సమస్త తేజములకున్ కూటస్థుడై తాల్చుఁ దా
నుదయం బభ్యుదయంబు నస్తమయమున్ వ్యోమంబునందున్ సుఖ
ప్రదుడౌ ప్రొక్కినఁ గన్నుదమ్ముల కెకెన్ఁ ప్రత్యక్ష దైవంబగున్
మది నెంతున్ జగదాత్మ సూర్యుఁగని, నిన్ త్రైలోక్య దీపాకృతిన్

# ఎప్పుడు వచ్చు స్వరాజ్యం?

ఎప్పుడు వచ్చు స్వరాజ్యం
బెప్పుడు నను చెందరెందరొ యడుగం
జొప్పెడదు గాని యయ్యది
యుప్పరమున నుండి గాలికూడి పడెడునె?

ఇచ్చెడిది కాదొక ళ్లులు
పుచ్చుకొనెడిది యనుగాదు భూజను అఖిలం
బిచ్చికొని తెచ్చుకొనఁ దా
వచ్చెడిదే కాని యిరక స్వారాజ్యమునన్.

సర్వమును విడిచి కొలిచిన
సర్వేశ్వరు డెట్లు లట్లు స్వారాజ్య పదం
బుర్విఁ గనబడెడు బాహ్యం
బర్వాక సనరూప ము క్తిధామంబగుచున్.

చేయవలెఁ గృషి నిరంత
మా యూ సంబన క యభిమతార్థంబునకై
పోయవలెఁ దపసుధారను
నీయవలెం దుదకుఁ బ్రాణమేనిఁ దృణముగన్.

కలియుగమున సంఘమయిన
గలదందురు శక్తి గానఁ గలతల నెల్లన్
నిలుపోడి హిందువులును ము
సలిమానులుఁ గలసి మెలసి నలపఁ దగు శ్రీపిన్.

స్వాతంత్ర్యామృత పానము
చేత మహోన్నత్వ పదవి సిద్ధించు, మహా
పాతకము మద్యపానము
చేత నధోగతియె మనకుఁ జేకురు నింకన్.

కట్టకు డీ సీమగుడ్డను
ముట్టకు డీ మత్తు ద్రవ్యముల నెవ్వియు, చే
పట్టకుడీ యాయుధములఁ
తిట్టకుడీ మిమ్ముఁ గొట్టితిట్టెడి శత్రున్.

కట్టకు విదేశీ వస్త్రము
కట్టకు, మన సాలె నోటికడ కూడు పడం
గొట్టకు, పాపాత్ముడవై
కట్టకు మురిత్రాడు తల్లి కంఠంబునకున్.

కాటకము కొట్టు దెచ్చియి
కూటికి గుడ్డకును లేక గోఁజాడెడి యీ
పాటకపు జాతి పాలిటి
హాటక శృంగంబు రాట్నమన నల్పంబే!

ఈ రాటనము ద్రిప్పుడి
యారాటము బాసి కందు రఖిల సుఖంబుల్
క్రూరాటవికుల పగిదిం
బోరాటములేల స్త్రీలు పురుషులు బిడ్డల్?

మును నన్నూలు వడికిన
జనులిప్పుడు ముదుకపోగు సాగించుటకున్
గనరాదు చింత "మును చి
క్కిన శశిపున్నతును దెలుపుఁ గిరణపు బలుపున్.

సన్నపు వలువలు క్రొన్నెల
వెన్నెలవలె నెందొ పట్టి వెదకగవలయున్
బున్నమ రేయెండ వలెం
జెన్నగు నెల్లెడల వెల్లచీరలె తరచై

బోధింతురు నయ భయముల
బాధింతురు చెరలఁబెట్టి పలు వగల మిమున్
శోధింతు రహింసా పర
మో ధర్మయటన్న పలుకు పోనాడుకుడీ!

నట్టింటి పగనుడీ చూ
పెట్టవలెన్ విషమ సంధివేళల నేర్పుల్
నక్షేటు కొండ దగిలిన
పుట్టి మునిగిపోవుఁ బ్రాణములు వ్యర్థముగన్.

శపథంబల్ల వసిష్ఠతో నలిపి విశ్వామిత్రుడుం బోలె దా
గపటోపాయములం గుతంత్రముల సంకల్పించి మిమ్మెల్ల దౌ
ష్ట్య పథంబందుఁ గనం దలంచు పరుడాశాభంగముం బొందగాఁ
జపలుల్‌గాక మహాత్ము పల్కును హరిశ్చంద్రుడున్ బలెన్ నిల్పుడీ!

ధర్మంబె జయము నిచ్చును
ధర్మమె స్వారాజ్య సంపదయు నిచ్చుఁ నికన్
ధర్మంబె మూల మంతుకు
ధర్మే సర్వం ప్రతిష్ఠితమ్మన వినమే!

## కైలాసవాసి జనమంచి వేంకటరామయ్య

డాక్టరు ఇంగువ కార్తికేయ శర్మ
శ్రీ షూలి వేంకట శ్రీనివాసరావు
శ్రీ రావిప్రోలు వేంకట శివశర్మ
శ్రీ జనుముల వరప్రసాదరావు

# సన్నతిలో లభించిన అశోకుని శాసనములు

సన్నతి యను గ్రామము (16⁰ 49′ ఉత్తరము: 76⁰ 54′ తూర్పు) కర్ణాటక రాష్ట్రములోని గుల్బర్గా జిల్లా చితాపూరు తాలూకాలో నున్నది. యాదగిరికి 50 కి.మీ వాయవ్యముగాను, చితాపూరు-నలవరు రైల్వే స్టేషనుకు 40 కి.మీ. బస్సు మార్గములో చేరనగును. ఈ గ్రామమున గల చంద్రలాంబ దేవాలయము కర్ణాటక రాష్ట్రవాసులకే గాక చేరువైన మహారాష్ట్ర ప్రాంత వాసులందరికీ ఆరాధ్య దైవముగా నున్నది. తిరునాళ్ళు జరుగుచున్నవి. ఈ అమ్మవారిని చండాల పరమేశ్వరిగాను, చంద్రాంబగాను స్థల పురాణము పేర్కొనుచున్నది. ఈ ప్రాచీన గ్రామము, భీమానది వద్దున పవిత్రమైన తీర్థక్షేత్రముగా కూడ వాసి గన్నది. పలు చారిత్రక స్థలములు, కోట శిథిలములు నది యొద్దుననే తూర్పున కనగనహళ్ళి గ్రామము వరకును కానవచ్చుచున్నవి. ఈ కోటను "సేతురాజని కోట" యని పిలుచుచున్నారు. శిథిలములైన యిటుక కట్టడములు రమారమి రెండు కిలోమీటర్ల భూమిని విస్తరించియున్నవి. ఈ చోటును రణమండలమని కూడ పిలుతురు.

మొదటిసారిగా (1954), నీ స్థలమును బౌద్ధ స్థావరముగ గుర్తించినవారు గుల్బర్గ వాసియగు కప్పత్రల కృష్ణారావుగారు[1] మైసూరు విశ్వవిద్యాలయమున ఆచార్యులైన శ్రీ శేషాద్రిగారు యీ స్థలమును పరిశీలించి శిల్పముల చరిత్రలపై నొక వ్యాసమును ప్రచురించిరి (1964-65)[2] అనంతరము శ్రీ పి. బి. దేశాయి (ఫిబ్రవరి, 1968), కర్ణాటక విశ్వవిద్యాలయము తరపున యీ ప్రదేశమును[3] దర్శించి కర్ణాటకములో నతిపెద్ద బౌద్ధ స్థలముగా పేర్కొనిరి.

ఈ గ్రామమున ప్రాచీన దిబ్బలు సాగుభూముల మధ్యగా నుండుటచే నప్పుడప్పుడు శాసనములున్న శిలలు వెలుగు వచ్చుచుండెను. ఈ శిల్ప శిలలు, అమరావతి - నాగార్జున కొండలోని శాతవాహన - ఇక్ష్వాకుల కాలమునకు చెందిన శిల్పముల పోలి యున్నవి. శాసనములబట్టి క్రీస్తుపూర్వము 2-3వ శతాబ్దినాటివిగాను శిల్పగాధలనుబట్టి దివంగతులైన గృహస్థులు, వైదికులు, అధిపతులు, రాజవంశీయులు మాత్రమే గాక వైశ్యులు, పరివ్రాజకులు గూడ పేర్కొనబడియుండుట ఈ ఛాయా శిలలలోని ప్రత్యేకతగా నెరుగవలసి యున్నది. కేవలము బౌద్ధ శిల్పము లనుట యుచితముగా తోచదు.

ఇక చంద్రలాంబ ఆలయ ప్రాంగణమున ఆలయమునందు కట్టడములోను, యిట్టి సున్నపురాయి శిల్ప-శిలాశాసనముల భాగములు మెండుగా లభించుచున్నవి. ఇటీవల కాలమున అనగా 1986-87వ సంవత్సరము నుండి భారతీయ పురావస్తు శాఖ, హైదరాబాదుశాఖ జేమ్సు హావెల్ యను బ్రిటిషు పరిశోధకుడు (సొసైటీ ఫార్ సౌత్ యేషియన్ స్టడీస్) కలసి వృత్తాకారముగా నున్న నొక దిబ్బలో త్రవ్వకములు సాగించిరి. కర్ణాటక విశ్వవిద్యాలయ ఆచార్యుడైన డా. అ. సుందర కోటగోడల ప్రాంతమున పరిశోధనలు జరిపిరి.[4] కోట కట్టడము 80 హెక్టేర్లు చుట్టు నాక్రమించి యున్నటుల కోట గోడలు నాల్గు మీటర్లు వెడల్పున మూడు మీటర్లు యెత్తు కల్గి రెండు భాగములుగా - రాజస్థానము, ప్రజల నివాసములు విడివిడిగా నున్నటుల పేర్కొనిరి.

## 1. అశోకుని శాసనములు : కనుగొన్న తీరు, వివరములు: (చిత్రము - 1)

శ్రీ అయోధ్యా ప్రసాదు సాగర జనవరి 12, 1988వ రణమండల స్థలమున పరిశీలించుచు మౌర్యకాలమునకు చెందిన నునుపైన శిలా ఖండము నొకదానిని కనుగొనిరి. (రిజి నెం. 367, ఎస్ ఎ ఎస్-2 14-1-88) ప్రాచీన యిటుకలు (54×27×8 సెం.మీ) కూడ అచ్చట దొరుకుచున్నందున మౌర్యకాలపు



ఛాయాచిత్రము - 1 సన్నతి : చంద్రలాంబ ఆలయము, దేవి గుడి.

అవశేషము లున్నవనే విశ్వాసము కలిగెను. హైదరాబాదు శాఖ తరపున త్రవ్వకములు కావించుచున్న శ్రీ శివశర్మ, వరప్రసాద రావులు పలుమార్లు చంద్రలాంబ దేవాలయమునకు పోవుట నిత్య కృత్యముగా జరుగుచుండెను. ఇట్లుండ దేవాలయ కమిటీవారు శిథిల మగుచున్న దేవి ఆలయమును (ఛాయాచిత్రము-1) పునరుద్ధరించు కార్యక్రమము చేపట్టిరి. గర్భగృహమందలి మహాకాళి విగ్రహము రెండు ముక్కలై యందున పూజార్హము కాకయుండెను. (ఛాయాచిత్రము - 2అ, 2ఆ) దీని కావున నూతన విగ్రహము ప్రతిష్ఠింప పూనుకొనిరి. ఆలయమున పడియున్న స్తంభములు- రాళ్ళను వెలికి తీసిరి. అమ్మవారి విగ్రహముంచిన పీఠము చాలా పెద్ద రాయి - గ్రానైటు బండ. విగ్రహము నిల్పుండ వీలగు పటుల మధ్యన చక్కని గుంట చేసియుండెను. ఈ బండ 2.33 మీటర్ల పొడవు, 1.21 మీటర్లు వెడల్పు గల్గి, 30 సెం.మీ. మందమున అభిషేక జలము పోవుటకు వీలుగా అంచు చుట్టును గట్టు ఉత్తర ముఖముగ ప్రణాళము చేసియుండెను. ఈ బండ ముఖమున అచ్చటచ్చట నిగనిగ లాడుచున్న నునుపుదనము ఛిద్రములైన అక్షర పంక్తులు గానవచ్చెను. శ్రీ శివశర్మ, వరప్రసాదరావులు యీ అక్షర పంక్తులను (20-1-89) అతి జాగ్రత్తగా పరిశీలించి అంత్యభాగమున "ఇయం ధమ్మ లిపి దేవానాం పియేణ" యని బ్రాహ్మీ యక్షరముల పాఠమును చదువుటయే గాక - నిస్సంశయముగా నీ భాగము అశోకుని శాసనముగా గుర్తించిరి.

కాని శాసనము యొక్క మిగతా భాగములు - పంక్తుల ప్రారంభమున-చివర భాగములు దెబ్బతిన్నవి. దేవి విగ్రహమ్ము, దేవాలయ కట్టడము రాష్ట్రకూట - నొళంబ చక్రవర్తుల కాలము నాటిదిగా (క్రీస్తబ్దము 8-9వ శతాబ్ది) శైలిని బట్టి - శాసనముల బట్టి యెరుగ గల్గితిమి. ఈ పెద్దబండపైని గల శాసన ప్రాముఖ్యతను తెలియనందున అప్పటి దేవాలయ నిర్మాతలు దానిని చెక్కి పైచి పాడు చేయుటయే గాక దేవి ప్రతిష్ఠకై పీఠముగా వాడుకొనిరి.

ఇదిట్లుండ ప్రఖ్యాత పురాతత్వజ్ఞుడు శ్రీ రంగనాథరావు (లోథల్, హరప్పా లిపి మున్నగు వానిపై రచయిత) సన్నతి లోని చంద్రలాంబ దేవాలయమును 29-1-89న దర్శించెను. పత్రికలలో ఈ శాసనబండను గూర్చి ప్రస్తావించి, పది పంక్తు లున్నట్లు అశోకుని కాలపు బ్రాహ్మీలిపి పోలిన వ్రాత, చాళుక్య నృపుల పూర్వమునకు జెందినదిగా ప్రకటన జేసిరి.[5] కాని శాసన ములు రెండును నిస్సంశయముగా అశోకుని కృతములు. ఇదివరలో లభించిన రాతి శాసనములు 12 మరియు 14 పతులను బోలి యున్నవి. బహుశ తక్కిన శాసనములు 1 నుంచి 11 మరియు 13 వరకున్న, యీ పలక పై భాగముననో లేక వేరు బండ పైననో గావింపబడి యుండవచ్చును. దేవాలయ నిర్మాణములో నష్టి రాతి ఫలకములు యెక్కడైన మరుగై యుండవచ్చును.




ఛాయాచిత్రము - 2

సన్నతి, అశోకుని శిలా శాసనములు - పాఠములు 12, 14.

ఈ శాసనములు పైకి రాగానే పండితుల దృష్టికి తేవాలనే సత్సంకల్పముతో సచిత్రములతో మా ఆంగ్ల వ్యాసములను కలకత్తాలోని ఇండియన్ మ్యూజియం సంస్థ డైరెక్టరు డా॥ రాజేశ చంద్రశర్మగారు మా వ్యాసమును మొదటిగా తన త్రైమాసిక పత్రికలో ప్రచురించిరి.[6]

ఇదిట్లుండ శ్రీ శ్రీనివాసరావు మరియు వరప్రసాదరావులు సన్నతిలో త్రవ్వకములు ఏప్రిల్ (1989) మాసములో గూడ కొనసాగించుచుండిరి. దేవి గుడిలోని యీ శాసన పీఠమును భద్రము చేయు నుద్దేశ్యముతో - మూడు ముక్కలుగా విరిగిపోయిన యీ పీఠమును 16-3-89 నాడు పైకెత్తించిరి. ఈ పనిలోనుండ, ఆవలివైపు ముఖ్యముగా పలక భాగము చక్కటి నునుపు గల్గిన వ్రాత తెలియవచ్చెను. మరి రెండు అశోక బ్రాహ్మీ లిపి శాసనము లున్నట్లు స్పష్టమయ్యెను. ఈ రెండు శాసనములు అశోకు డొసగిన ప్రత్యేక ధర్మశాసనములు 1 మరియు 2, కళింగ దేశ మున మాత్రమే కానవచ్చినవగుటచే మరింత ఉత్సుకత గల్గెను. ఈ శాసనముల గూర్చి వెంటనే ఆంగ్లమున వ్రాసించితిమి.[7]

## ౭. అశోకుని శిలాఫలక శాసనములు

(ఛాయాచిత్రము - 3)

### (అ) మొదటి భాగము

శాసన పాఠమున పంక్తుల ఆద్యంత భాగములు ఛిద్రమైనవి బండ అంచున గట్టు చేయబడెను. మధ్యస్తముగా నాళిక చేయుటకై గుంట చేయబడెను. బండపైని యక్షర పంక్తులీ విధముగా దెబ్బ తిన్నవి. కొన్ని పంక్తులు కూడ వరుస క్రమమున వ్రాయబడ లేదు. అక్షరములు పెద్దవిగను, చిన్నవిగను కూడ ఉత్కీర్ణింప బడెను. లిపి శైలి, పాఠ్యభాగముల బట్టి, అశోకు డొసగిన యెర్రగుడి మరియు కాల్సి (ఉత్తరప్రదేశము) రాతి శాసనములకు చేరువగా నున్నది. శాసనములందు అశోకుని నామము కానరాదు. మొదటి 8 పంక్తులు (1 నుండి 8), అశోకుని రాతి శాసనము 12 కనుగుణముగా నున్నది. అట్లే చివరనున్న నాల్గు పంక్తులు (9 నుండి 12), అశోకుని 14వ రాతిశాసన పాఠములకు చేరువగా నున్నది.

లభ్యమైన శాసన భాగము : 12వ రాతి శాసనము

పంక్తులు :

1. ‥‥‥ పా ‥‥ ఆస ‥‥

2. . . . . . . అకొ . . . . నొ . . హె
3. . . . . . . తం అంతపాపాథం . . . . చ ఛ . . .లపాస. .
4. . . . . గల హతి సవె అత పాపాథం - కిత అ . . |
5. - . తి అతపాసాడం పే సమ వాయె వస . . మ . . . .
6. స వ పా స ం థ ం బహు సుత చకియా నాగమ - . . . . .
వుపగినవట...
7. వ మ న తి అ థకితి సల వ(థవ- -) . . . . క.
8. మహాపతవచ రాజి మికా అనే ధవి - . . . . . .

ఈ లభ్యమైన పదభాగములను ఎర్రగుడి కాల్సి శాసనము లతో పోల్చి పూరింతుమ సన్నతి శాసనమున లభించిన యక్షర ముల-పదముల క్రింద గీత గీచి చూపింతుము.

పూర్తి పాఠము[8] : తెలుగుసేత

1. దేవా నంపియెపి యదసి లాజా సవ పాసండాని పవజితాని
గహ థాని పూజెతి దానేన వివిధాయచ పూజయా

దేవతలకు ప్రియుడైన ప్రియదర్శి రాజు సన్యాసులను గృహస్తులను సమస్త శాఖలవారిని వివిధ దానములచేతను పూజల చేతను గౌరవించుచున్నాడు.

2. నొచు తధా దానంవ పూజావా దేవానంపియె మంనతి అథా కితి
సాలవథి సియా సవ పాసండానం

ఐనను దేవతాప్రియుడు దానాది గౌరవముల కెక్కువ ప్రాధాన్యమివ్వక, ధర్మవృద్ధికి, యెల్ల ప్రజలలో ధర్మచింతనకు ప్రాధాన్యమిచ్చును.

3 సాల వధినా బహు విధా
ధర్మాంగముల వృద్ధికి మార్గములు పెక్కులు.

4. తసచు ఇయం మూలె అవ ఛ గుతి కితి అత వాసండ పూజావ
పలషానంద గలహావా నొపియా అపి కలనపి లహుకావపియా
తపి తపి పకలన సి

దానికి మూలమిది. ఒక మత శాఖవారు తమ శాఖలను గూర్చి పొగడుకొనుట, పర మత శాఖలను నిందించుట చేయక, మాట్లాడునప్పుడు మితముగ నుండుట ముఖ్యము.

ఈ పంక్తిషుండి సన్నతి శాసన పాఠభాగముల క్రింద గీత గీచి చూపబడినది. 8వ పంక్తి పదముల కానరాము.



ఛాయాచిత్రము - 2 ఎ
సన్నతి, చంద్రలాంబ విగ్రహము, పై భాగము.

5. పూజెతవి యావచు పలపాసండా తేనతెన అకొరెన
ఎల్లవేళల పరశాఖల వారిని పూజింపవలెను.

6. హెవం కలంతం అతపాసండం వాఢం వఢయతి
పలపాసండవపిచ ఉపకరెతి.

ఇట్లు చేసిన యెడల తన శాఖల కభివృద్ధి యగును. ఇతర శాఖల కుపకారి యగును.

7. తదంనధా కలంతం అతపాసండ చ ఛనతి పలపాసండస పి
చ అప కలెతి.

దీనికి వ్యతిరిక్తముగా నాచరించినచో తన శాఖను నిర్మూలము చేసికొనుటయే గాక యితర శాఖల కపకారము చేయువాడగును.

8. ఏహి కెచ్ఛి అత పాసండం వా గిలహతి సం అతిపాసండ భతియా వా కితి ఇ తపాసండం దిప యెయ(తి) సెవమని తథా కలంతం బాధ తితె ఉపహంతి అతపాసండం

కేవలము తన శాఖను గొప్పగా స్తుతించుచు యితర శాఖలవారిని గర్హించువాడు తన శాఖకే యెక్కువ అపకారము చేయువాడగును.

9. సె సమ వాయె వాసాధుకితి అంనం అనాసథం ఎంయు సెవుఁ ను సూసెయుచ.

మాటలలో సంయమము వలన ఒకరిపై నొకరికి గౌరవాభిమానములు పెరిగి ధర్మచింతనకు దోహదమగును

10. హేవం హి దేవానంపి యస ఇఛాతి సవ పాసండా బహు సుతాచ కాయా నాగమా చ హా వెయుతి.



ఛాయాచిత్రము - 2 బి

సన్నతి-చంద్రలాంబ విగ్రహము, క్రింద భాగము

అందుచేతనే దేవతల ప్రియుడు అందరిని యెల్లమతముల మూల సూత్రములను గ్రహించి జ్ఞానోపార్జన చేయమని కోరుచున్నాడు

11. యె చ తత తత పాసం నా తెహి వత విమె

ఇందుమూలముగా సర్వమతానుయాయులకు తెలియజేయుట దేమన

12. దేవానంపియె నొ తథా దానం వా పూజ వా మంనతి అథకితి సాల వ ధిసి యా సవపాసండానం తి

దేవతలకు ప్రియుడు ప్రజలు చేయు దాన ధర్మములకు గౌరవాదరములకు ప్రాధాన్యమీయక ధర్మవ్యాప్తికి, చింతనకు ప్రాముఖ్య మొసగుచున్నాడు

13. బహు కాచ ఏతాయె అథాయె వియావటా ధంమ మహా మహామాతా ఇథి ధియ ఖ మహామాతావచ భూమికాచ అంనె చ నికాయ

ఈ కార్యసిద్ధికై రాజోద్యోగులు ముఖ్యముగ ధర్మమహామాత్రలు, అంతఃపుర విషయముల పర్యవేక్షించు మహామాత్యులు, భూమికులు మొదలైనవారు నియోగింపబడిరి

14. ఇయం చ ఎత నఫలె అతపాసంద వధిచహోతి ధంమస చ దీపనాతి

వారివలన తమ తమ శాఖల వృద్ధి, ధర్మబోధన పరిరక్షణ వీరి ఉద్యోగ ధర్మము

(అ) 14వ రాతి శాసనము : చిత్రము-2

9. ఇయం ధంమ లిపి దేవానం పి యెణ . ....వస.......

10 నో హినవతి నవె ఘతి (తె).......

11 తిఎ తస అ(థస) మాధురియయ... జ్ఞో... తత...

12. ...కాలనం వ అలోచయితు లిపికరాప . .. ధవత.....

పై పంక్తులను యెర్రగుడి - కాల్వ మున్నగుచోట్ల లభ్యమయిన 14వ రాతి శాసన పాఠముతో చేర్చి చదివినచో కొంత అవగాహనకు వచ్చును.

పూర్తి పాఠము[9] : తెలుగుసేత

పంక్తులు: 1, 2 : ఇయం ధంమ్మ లిపి దేవానం పియేణ
పియదసినా లాజినా లిఖా పితా
అధియే వసంతి తెన అధిమ ఖి యెసి అధి విధ తెన:

ఈ ధర్మలిపిని దేవతల ప్రియుడైన ప్రియదర్శిరాజు వ్రాయించెను. సాధారణముగ యీ ధర్మసూత్రముల సంగ్రహము గను, మధ్యరకముగను, విపులముగ వ్రాయబడెను.

3, 4 : నో హిసవగి సవమ చరెచ మహీకెహి విజితె బహు చలిఖి
తెలిఖా పయిసామి ఛెవని కాయం అథిచ హెత పున
పునలపి తెతన

ఎందుచేతననగా యీ శాసనము లన్నియు సమస్త దేశముల లోను సమగ్రముగా లిఖించుటకు వీలు కాలేదు. జయించిన రాజ్యము అతి విస్తారమైనందున లిఖించినది చాలవరకైనను యింకను లిఖింపవలసి యున్నది.

3. తస ధజ్జో - న మాటల యత.........ఉలో తథవ: ఈ పంక్తి
కాల్సి - ఎర్రగుడి శాసనముల యీ విధముగా నున్నది—
తస అథ సమధులియాయె యేనతె తథా పటి పజెయావి సియ
అత కిఛి అసమతి లిఖితె దెసంవా సంఖా సంఖా య్యాయా.

కొన్ని భాగములు మిక్కిలి మధురములై యుండుటచే జనులు వాని ప్రకారము నడుచుకొందురని తిరిగి తిరిగి వ్రాయబడినవి. ఆయా ప్రదేశముల కనవసరమని తోచినప్పుడును సంక్షిప్తము చేయు ప్రయత్నము.

4. ....కాలనంప ఆలోచయితు లిపికరాప లాధెనవా . ధవత ...

లిపికారుని పొరపాటు వలననో ఈ శాసనములో కొన్ని యసంపూర్ణములుగా లిఖింపబడినవి.

8. అశోకుని ప్రత్యేక శిలా శాసనములు
(ఛాయాచిత్రము - 4)
(రెండవ భాగము)

ఈ ప్రత్యేక శిలా శాసనములు ఓఢ్ర దేశమునందలి జోగాడ (గంజాము జిల్లా), ధౌళి (తోసలి, పూరి జిల్లా)లోను యిదివరలో లభించినవి. కళింగ శాసనములుగా ఖ్యాతి బడసినవి.

దినేశచంద్ర సర్కారు పండితుడు ఈ ప్రత్యేక కళింగ శాసనములను రాతి శాసనములు 15గా పేర్కొనిరి.[10] క్రీ.పూ 257-56 సంవత్సరమున చిన్న శాసనముల (ఎమ్.ఆర్.ఇ. 1-3)నొసగుచు కళింగ ప్రత్యేక శాసనములను గూడ విచ్చెను. అనగా కళింగ యుద్ధానంతరము (క్రీ.పూ. 261-60 లేక 262-61) ఎనిమిది సంవత్సరములకు కావించె నన్నమాట.

ఈ ప్రత్యేక శాసనములను కళింగ 1 మరియు 2గా నామకరణము చేసిరను మొదటి శాసనము 1) తరువాత కావింప బడినది ఈ ఫలకయందు కూడ రెండవ శాసనము (2) పంక్తులు తిరుగా లిపి చక్కగా చెక్కబడినది. (ఛాయాచిత్రము- )

ఒకటవ శాసనమునకు చెందిన పంక్తులలో ఐందకు కుడి యంచున కొన్ని యక్షరములు మాత్రమే కానవచ్చుచున్నవి. ఈ శాసనపు చివరి పంక్తులు 12-13. రెండవ శాసనము క్రిందున పూర్తిచేసిరి ఈ వ్రాత తీరును బట్టి తేలినదేమన, రాతి ఫలకమును నిలువుగా స్థాపించిన తదుపరి యీ ప్రత్యేక శాసనము(2)ను లభ్యమయిన స్థలమున కుదించి కావించిరి. కొంత స్థలాభావము వలన చివర పంక్తులు యిటు నటు వ్రాయవలసి వచ్చెను. కళింగ దేశమున ఈ ప్రత్యేక శాసనములు, రాతి శాసనములైన 11, 12, 13లకు బదులుగా కావింపబడెనని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. కాని సన్నతిలో 12వ శాసనమున్నది గదా? ఇచ్చట రాతి శాసనములు 12 మరియు 14 ప్రత్యేక శాసనము 1 మరియు 2ను యిరుప్రక్కల బండపై ముత్తముగా చెక్కిరి. చదువరుల కనువుగా నీ శాసన ఫలకమును కట్టడము మధ్యగా, నిలువుగా స్థాపించిరన్నమాట అశోకు డొసగిన రాతిబండ శాసనములు. స్తంభ శాసనములే కాక యీ విధమైన రాతిఫలకముపై శాసనములు గావించుట ఈ సన్నతిలో నొక ప్రత్యేకతగా నెరుగవలయును. చిన్నదైనను యిట్టి కోవకు చెందిన ఫలక శాసనము బైరట్ (జైపూరు దగ్గర, జైపూరు జిల్లా, రాజస్థాన్) అనుచోట లభించెను.

(అ) ప్రత్యేక శాసనము (1) (చిత్రము-8)

లభ్యమయిన పాఠము చాల కొద్దిది. కాని కళింగ శాసనముల నాధారము చేసికొని పాఠమును వివరింతును. ఇందున పైని 15 పంక్తులు బొత్తిగా లేవు. కాని ప్రకృతమున శాసనాలు గల అక్షరములు మొదట పేర్కొందును. తర్వాత పూర్తి పాఠము 16-వ పంక్తి మొదలు చెప్పి లభించిన యక్షరముల క్రింద గీత గీచి పేర్కొందును. మనకున్న ఈ క్రింది పాఠమున 5 నుండి 12వ పంక్తి వరకు పోల్చుకొనుట కష్టము.

లభ్యమయిన పాఠ్యభాగములు

1. .... .... .... .... తవియె

2. .... .... .... .... అం నవో

3. .... .... .... .... ధీ చెవానం

4. .... .... .... .... కు(ను)షి

5. ... .... .... .... ధీ

6. .... .... .... త.



చిత్రము - 3
నన్నతి, అశోకుని ప్రత్యేక శిలా శాసనములు.
పాఠములు 1 మరియు 2

7. .... .... .... చకరంతం

8. .... .... .... అథా .... ....

9. .... ... .... లో .... ....

10. .... .... .... రవ .... .... ....

11. .... .... .... చగల .... .... ....

12. .... .... .... ఖా కరం .... .... .... క

13. ........ యెవ అఖా........ పవగవి ఖామి (గుంట) వి అతి కామె పతి

14. .... .... నపానవ .... .... పయితు అతహె (గుంట)వి సతితం పిహెవాక

15. .... .... సథీతి ....

శాసన పాఠము[11] : తెలుగుసేత

పం క్తి-16: నితియం పకిలం తేపియానతే ఊగథ
సం చలిత వియే తువటి తవియే వా

రాజనీతి యందలనట జెందు వాడున్నతిని బొందడు. కావున నీతి యందు నడువ వలయును. సంచరింప వలయును. ముందుకు పోవలయును.

పం క్తి-17:
హేవం మేవ ఏద ఖేయ తుపాక తేనవత వియే అనంనే
దేవత హేవం చహేవంత దేవా నం పియస అనువధి

ఈ విషయమై శ్రద్ధ వహించువాడు మీతో "మీరు రాజు యిఙ మును తీర్చ ప్రయత్నింపుడు. ఈ విధముగా దేవానాం ప్రియుడు మిమ్ముల శాసించుచున్నాడు" అని చెప్పవలయును.

పం క్తి-18: సే మహా ఫలే వతప నంపటి పాచమహా అపాయే
అసంపటిపతి.

ఇట్లు చేయుట వలన గొప్ప ఫలము కలుగును. చేయకపోవుట వలన గొప్ప యపాయము కలుగును.

పం క్తి-19:

విపటి పాదయ మీనేహిపతం నథిస్వగ ప అలథి నోవాజాఅధి
దీనినమనరింపనివారికి స్వర్గము లేదు సరిగదా రాజానుగ్రహము కూడ కలుగదు.

పంక్తి-20: దు ఆహలేహి ఇమన కం మనమేకుతేమనో అతిరేకే.

తన ధర్మమును సరిగా నిర్వహింపని వానియెడల నా మనసెట్లు సంతోషింపగలదు.

పంక్తి-21: సంపటిప జమీనేచుపతం స్వగం ఆలాధయి పధ
మమచ ఆననియం ఏహథ.

కాని ఈ ధర్మమును పరిపాలించినచో మీకు స్వర్గము కలుగుటయే గాక మీరు మీ రాజ ఋణమును గూడ తీర్చుకొను వారగుదురు.

పంక్తి-22: ఇయం చలిసి తినన ఖ తేవ సోత వియా.

ఈ ధర్మ శాసనమును ప్రతి తిష్య నక్షత్ర దినమందు అందరు వినుచుండవలెను.

పంక్తి-23: అంత లాపిచ తిసేన ఖన పిఖనసి ఏకేనపి సోతవియ.

ఒక తిష్య నక్షత్ర దినమునకు, మరియొక తిష్య నక్షత్ర దినమునకు మధ్య దినములలో కూడ అప్పుడప్పుడు ఒక్కడైనను దానిని వినుచుండవచ్చును.

పంక్తి-24: హేవంచ కరంతం తుఫేద మథ సంపటిపాదయితవే

మీరిట్లు చేసినచో మీ ధర్మము నిర్వహింప శక్తి బడయుదురు.

పంక్తి-25: ఏతాయే అతాయే ఇయం లిపి లిఖిత హిదయేన నగల
వియో హాలకాన స్వతం సమయం యూజేవూతి....
మన అకస్మావలి బోదేవ అకస్మావలికి లేసే వనో
వియాతి.

నగర జనులకు అకారణముగా బాధ గలుగకుండునటుల నగర వ్యవహారకులు చూచుచుండవలయును. ఈ ఉద్దేశ్యముతో ఈశాసనము లిఖింపబడినది.

పంక్తి-26: ఏతాయే చ అతాయే హకం.........మతేవంచసు
పంచసు వసేసుని ఖామయి సామి ఏ అఖఖసే అచండే
సఖినాలంభే హోసతి ఏతం అతంజానితు .... తథా
కలంతి అథమమ అను సథీతి.

ఇందులకై కర్కశుడు కాని అచండుడైన వర్తనుడైన వానిని జనులు నా ధర్మము ననుసరించుచున్నారో లేదో శ్రద్ధతో తెలిసి కొనుటకు అయిదేసి సంవత్సరముల కొకసారి మహామాత్రుని పంపుచున్నాను.

పంక్తి-27:
ఉజేనితే పిచుకుమాలే యెతాయేవ అఠాయే నిఖామయిస
హేదిసమే వవగం నోచ అతి కామయి సతి తిని వసాని.

ఉజ్జయిని నుండి కూడ రాజకుమారులందరికి పై గుణము లున్న వానిని మూడు సంవత్సరము లతిక్రమింపకుండ పంపు చుండిరి.

పంక్తి-28: హేమేవ తఖ సిలాతేపి

ఆ తీరుగనే తక్షశిల నుండి కూడ పంపుచుండిరి.



ఛాయాచిత్రము - 3
సన్నతి, అశోకుని రాతి శాసనములు 12 మరియు 14

పంక్తి-29: అదా అ....దే మహా మాతా నిఖ మి నంలి అనుసయా
సంలిదా అహా పయితు అత కం మం ఏతంపి
జానిస తి లి పి తథా కలంతి అఫిలాజిసే అను సఠీతి

ఈ మహామాత్రులు బయలుదేరినప్పుడు తమ ధర్మమును మరువక యా యుద్యోగస్థులు రాజ శాసనములను సరిగా పరిపాలించు చున్నారో లేదో తెలుసుకొనుచుందురు.

ప్రత్యేక శాసనము-2 (ఛాయా చిత్రము- )

శాసన ఫలకపు పైభాగము విరిగియున్నవి మొదటి మూడు పంక్తులు, నాల్గవ పంక్తి కొంతమేరకు ఛిద్రములైనవి. శాసన పాఠము ప్రత్యేక కళింగ శాసనములైన జౌగడ (గంజాము జిల్లా), ధౌళి (పూరీ జిల్లా) యనుచోట్ల లభించినవానికి వేఱుగా నున్నది[12] ఈ ప్రత్యేక శాసనముల వివరలో పండిత దినేశ చంద్ర సర్కారుగారు[13] రాతి శాసనము-15గా పేర్కొనిరి.

(ఈ) లభ్యమయిన శాసనపాఠము : (చిత్రము-8)

1. — — అను విగ — —
2. — — సేవుచ సుఖమేవచ లభవు — —
3. — — యేనచ హేవం పాపునేవు రాజ నెఖమ — —
4. మె ఖమితవె మమం విమితం (చ) ధమ్మం చరేవు హిద (లోకం)
5. చ పలలోకంచ అరాధ యేవు (చ) ఎతాయచ అథాయ హకం తుఫె
6. అను సాసామి అవనో హకం తుఫెని అనుసాపిత ఛందంచ హితు
7 యూ హి సమదీతి పటనాచ అచలా సాతి హేవంకటు కమ్మె చరితవియె
8 అస్వాసేతవియా చ తేయేన చ తె హెవ పాపునేవు అథాపితా హేవం
9 రాజా యథాచ అతానం అనుకంపతి హేవం అపెనియ
10 చకవజ హెవం మయిసెహకం టుఫెవి అనుసాసితు ఛందంచ
11 ఖ దేవావు తికే ఎతసి అఫపి హాహమి ఆలాహితుఫె అస్వా సనాయె
12 హిత సుఖాయచ తేసం హిదలోకికా పారలోకి కాయె ఎతంచ హేవం

13. కరంతం స్వగంచ ఆరోధే సాధ మమవ ఆనసీయం ఎహాతం ఎతా
14. — — యి ఇయం లిపి హిదలిఖితా అథా మహామాతా సాస్వతం
15. — — యు జేవు ఆస్వాప నాయధంమ్మ చరనాయ చ అంత
16. — — చ లిపి అను చత మాధి సోత(వి)యా—సెహి అంత రాపి
17. — — హిఖనస ఖనం (గుంట) తరియా హెవం—
18. — — ఎతసంప టి (గుంట) — —

పూర్తి శాసనపాఠము : తెలుగుసేత

(జౌగాడా శాసనాధారముతో)

1-2 దేవానంపియె ఏవం ఆహ సమాపాయం మహీమతా లాజవచనిక వతవియా

సఖా ప్రియుడిట్లు చెప్పుచున్నాడు. సమాపీ నగరమునందలి మహామాత్రులు రాజవచనముల నిట్లు చాటింపవలయును.

3-4 అంకి ఛి దఖామి హకంతం ఇఛామి హకం కింతి కం కంమన పతి పాతయేహం దువాలతేచ ఆలభేహం ఏసదమే మోఖియ మతం దువాలా ఏతస అ థస అంతుఫేసు అనుసథి

యేదైన ముఖ్య విషయము చూచినాతనే 'అట్టిదానిని ఆచరణలో పెట్టుటకై మంచి మార్గమును యోచించి ప్రజలు పాటించుటకై తెలుపుట కర్తవ్యముగా నెరుగుదుము.

5-6 సామె పజా అథవజాయే ఇఛామి కింతిమే సవేణాం హిత సుఖేన యుజేయూతి, హిద లోగిక పాల లోకి కేణ హేవం యేవ యే ఇఛ స వమునిసేసు సియా అంతానం అవిజితానం కిం ఛందేసు లాజా అఫే సూతి.

సర్వప్రజలు నా బిడ్డలు. నా బిడ్డల కేవిధముగా సుఖ సౌఖ్యములు కోరుకొందునో, ఇహ పర లోకమందున కూడ అట్లే నా ప్రజలను నేను ప్రాపంచిక, పరలోక సౌఖ్యములను శాంతిని కోరుకొనుచున్నాను. నేను జయించిన నా రాజ్య ప్రాంతవాసులు "రాజు యేమి చేయవలెనని కోరుచున్నార"ని అడుగవచ్చును.

7. ఏతా అనాషే అత్ర (అంతేషు) సేయసేయుర్ణా అపేవ్యం ఇవ్వతి అన్న వి గిస్తు, స్వేయా, షుమియ్యా యే, అన్న పేయుద మే సుఖం మేవచ లహేయ్యా మమమేనోఖం షేవం చ పాపు నేయ ఇషి వతి నే ల్హాణా యె నకి యేఖ మిత.వే మమం విమితం చ ధం మం చ లే యూతి హిదలోగంచ పలలోగంచ అలాథ యేయూ.

వారు నాకు భయపడనక్కరలేదు. నా యెడల విశ్వాసముతో నుండనగును. సౌఖ్యమునే కాని దుఃఖము పొందరు. దేవతా ప్రియుడు క్షమించదగిన దానిని క్షమించును. ధర్మాచరణమందు వియుక్తులై వారు యిహ లోక పరలోకములందు సౌఖ్యమును పొందవలయునని కోరుచున్నాను.

8. ఏతాయేచ అఠాయే హకంతుషేవి అనుసాసామి అనవే ఏతకేన హకంతుషేవి అను సాసియ ఛందం చవేది తు ఆమమధీతి పటింనాచ అచలా

ఇందుమూలమున నేను వారి ఋణమును తీర్చుకొనుటకు ధర్మాచరణము నందు నాకుగల దృఢ ప్రతిజ్ఞయు, వ్రతమును గురించి తెలియజేయుటకు నేను ఈ శాసనమును చేయుచున్నాను.

9. సహేవం కటుకంమే చలితవియె ఆస్వాస వి యాచతే ఏనతే పాపు నేయు అథపి తాహేవం నేలాణాతి అథ అకానం అను కంపతి హేవం అషేని అనుకంపతి అధా పజా హెవం మయే లాఖనే

అందుచేత మీరు ధర్మము నాచరించుచు మీ విధులను నిర్వర్తించి, దేవానాం ప్రియుడు వారిని తనవలెనే ప్రేమించు చుండుననియు, వారు దేవానాం ప్రియునికి ఆత్మసంతానము వంటి వారని తెలుసుకొని విశ్వసించి ప్రవర్తింపజేయవలయును.

10. తుషేని హకం అనుసాపిత ఛాందంచ వేదిత ఆమమధితి ఏటింనాచా అచల సకల దేపాఆయుతికే. హూసీమీ ఏతవి అతవి

అందుకొరకే మీకు ధర్మోపదేశము చేసినా యిచ్చ నెరింగించి ఆయా దేశములకు మిమ్ము అధికారులనుగా నియమించుచున్నాను.

11. అలంహి తుషే అస్వాస నాయె హిత సుఖాయేచ తేసం హిద లోగిక పాలలోకి కాయే

మీరు ఆ ప్రాంతీయులకు విశ్వాసము కలిగించి వారి ఇహలోక పరలోక సౌఖ్యము సంపాదింప శక్తివంతులని తెలియజెప్పుడు.

12. హేవంచ కలంతం తుషే స్వగం అలాధయిప ధమ మచ ఆననియం ఏహథ.

వీరిట్లు ఆచరించిన యెడల స్వర్గము కలుగును. మీరు ఋణమును తీర్చుకొందురు.

13. ఏతాయె చ అతాయే ఇయం లిపి లిఖితాహిద యేవ మహామా తాపాశ్వతం సమయుతినంతి ఆస్వాస నాయే ధంమ చలనాయేచ తీన అంతానం



ఛాయాచిత్రము - 4
సన్నతి, అశోకుని ప్రత్యేక రాతి శాసనములు 1, 2

మహామాత్రులు సర్వకాలముల యందును ప్రాంతవాసుల యందు విశ్వాసమును బుట్టించి ధర్మాచరణమునందు వారిని నియోగింతురను ఉద్దేశ్యముతో నీధర్మలిపి లిఖింపబడినది.

14. ఇయం చ లిపి అనుదాతుం మాసంతి సేన నఖతేన సోతవియా

ఈ ధర్మానుశాసనమును నాలుగు మాసముల కొకసారి తిష్యా నక్షత్ర దినమున నందరును వినుచుండవలయును.

15. కామంచు ఖనసి ఖనసి అంతలాపి తిసేన ఏకేనపి సోతవియ

ఒక్కడైనను దానిని వినగోరిన యెడల రెండు పుష్యా నక్షత్ర దినముల మధ్య దినములందు గూడ వినవచ్చును.

16. హేవం కలంతం తుఫే చ ఘత సంపటి పా తయితవే.

మీరిట్లు చేసిన యెడల నా యాజ్ఞలను వర్తింప శక్తులగుదురు.

4) సన్నతి శాసనముల ప్రాముఖ్యత:-

కర్ణాటకమున అశోక చక్రవర్తి లఘు శాసనముల పరిసర ప్రాంతవాసులకై నొసగియున్నాడు. ఇట్టి శాసనములు బళ్ళారి జిల్లా, సిరిగుప్ప తాలూకా నిట్టూరు, ఉదెగోల యనుచోట్ల; చిత్రదుర్గ జిల్లా బ్రహ్మగిరి, సిద్ధాపుర, జటింగ రామేశ్వర యను గ్రామముల; రాయచూరు జిల్లా, గావిమఠ, పల్కిగుండు యను చోట్ల లభించినవి. (చూడుడు చిత్రపటము-1) అశోకుడు ఈ లఘు శాసనములు (1 నుంచి 3) తన 13వ రాజ్య సంవత్సరము అనగా క్రీ.పూ. 257-256 యొసగెను. సన్నతిలో నిట్టి కోవకు చెందిన శాసనములు లభ్యము కాలేదు.

ఆంధ్ర-కర్ణాటక లోని
అశోకుని శిలాశాసనములు




దక్షిణ దేశమున, కర్నూలు జిల్లా ఎర్రగుడిలో నీలఘు శాసనములున్నవి. ఇవి మొట్టమొదట కావింపబడినవి. అశోక చక్రవర్తి తన 12వ రాజ్య సంవత్సరమున (క్రీ.పూ. 258-257), ధర్మబోధనకై సదుముకట్టి స్వర్ణగిరి ప్రాంతముల వచ్చినటుల యాధారములున్నవి. ఈ సువర్ణగిరి (జొన్నగిరి) ఎర్రగుడి యనియే పండితుల[14] యభిప్రాయము. అశోకుడీ చోటున దక్షిణ రాష్ట్రమున కంతటికి ఉపనగరముగా చేసి, ఆర్యపుత్రుని అధిపత్యమున మహామాత్రుల నెలకొల్పెను. అనగా ఎర్రగుడి మౌర్య సామ్రాజ్యమునకు దక్షిణ పట్టణమైనది. ఇచ్చట మరొక విషయము గూడ పేర్కొనవలసి యున్నది. బ్రహ్మగిరి-సిద్ధాపుర లఘు శాసనము వలన అశోకుడే స్వయముగా ధర్మయాత్ర చేయుచు 256. రాత్రులు గడిపియుండినటుల తెలియుచున్నది. ఎర్రగుడికి చేరువైన (30 కి.మీ. ఉత్తరము) రాజుల మందగిరి యనుచోట నొక మహాసభకు అధ్యక్షించెను. దక్షిణదేశమున సామంతులు, ధర్మ మహామాత్రులు యిచ్చోట సభకూడిరి. అందు వలననే ఈ పర్వతమునకు "రాజుల మందగిరి" యను నామాంతరము గల్గెను. ఇచ్చట లఘు శాసనములు 1-2 గావింపబడెను. ఈ మహాసభ యనంతరమే గాబోలు. అశోక చక్రవర్తి రాతి శాసనములు 1 నుంచి 14 ఎర్రగుడిలో కావించెను. (క్రీ.పూ. 257-56) ధర్మ మహామాత్రులను నెలకొల్పెను. ఈ కర్నూలు ప్రాంతమున చేరువైన ఉత్తర కర్ణాటకమున ముఖ్యముగ సన్నతియందు రాతి శాసనములు 12, 14 లభించుటచే ఎర్రగుడిలోవలె, సన్నతి యందున కూడ ధర్మబోధనకై మహామాత్రుల నియమించినటుల స్పష్టమగుచున్నది. అనగా సన్నతి గుల్బర్గా మున్నగునవి మౌర్య సామ్రాజ్యాంతర్గత ప్రదేశములుగా నుండెనన్నమాట.

సన్నతిలోని ప్రత్యేక ఫలక శాసనములు :

అంతటితో నాగక మౌర్య చక్రవర్తి సన్నతియందు ప్రత్యేక శిలా శాసనములను గూడ ప్రకటించెను. ఇదివరలో కళింగ దేశమునందలి జౌగాడ, ధౌళి యనుచోట్ల మాత్రమే యీ ప్రత్యేక శిలా శాసనములను క్రీ.పూ. 263-62లో ప్రకటించెను. కళింగను యుద్ధమున జయించిన తరువాత సీమలందలి ప్రజలను యుద్ధభీతినుండి విముక్తుల జేయుచూ శాంతి, ధర్మ చరితవ్యములను గూర్చి ఈ శాసనముల ద్వారా ప్రజలకు బోధింపజేసెను.

అశోకుడి ప్రాంతముల ప్రజలను తనవారినిగా చేసికొనుటకై మిక్కిలి ప్రేమాదరములు చూపి శాంతి ధర్మములను ప్రబోధించి వృద్ధి చేయుమని కోరెను. ఈ అంతర్గత రాష్ట్రముల తన వంశీజుల ప్రాదేశిక లేక రాష్ట్రికలు గనో, ధర్మ మహామాత్రలు గనో నియమించెను. తోసలియందు, కర్నూలు ప్రాంతమున జొన్నగిరి యందు ఈ విధముగా రాష్ట్రికలను (యువరాజుల) నియుక్తి చేసి ధర్మ విరతిని కాపాడి పెంపొందింపజేయమని శాసించెను. ఈ ధర్మ శాసనమును ముఖ్యముగ పుష్యానక్షత్ర దినములో, చతుర్మాసినాడు అనగా ఆషాఢ పూర్ణిమ, కార్తీక పూర్ణిమ, ఫాల్గుణ పూర్ణిమ దినముల మహామాత్రలు ప్రజలకు చదివి చెప్పవలెను.

సన్నతి శాసనముల మరియొక ప్రత్యేకత గమనింపవలసి యున్నది. రాతి శాసనములు, కొండ చెరియలు, రాతిగుండ్లపైన గావింపబడెను, ధర్మ స్తంభములు వానిపై ధమ్మలిపి బౌద్ధస్తూపారామముల యందు నెలకొల్పబడెను. దక్షిణమున గుంటూరు జిల్లా అమరావతి మహాస్తూపమున స్తంభ శాసనముండినది. స్తంభ శాసనముల కోవకు చెందినది, 27వ రాజ్య సంవత్సరమున శావింపబడియుండెను. (క్రీ.పూ. 244-243) ఇటు రాతి శాసనములు సామ్రాజ్యపు యెల్లలందు గావింపబడినవి.

సన్నతి రాతి ఫలకమున యిరువైపుల శాసనములున్నవి. అనగా ఈ 'శిలా ఫలకము' షుమారు మూడుమీటర్లు యెత్తు గల్గి అంతకు సగము వెడల్పు, 30 సెం.మీ. మందముతో కట్టడము మధ్యగా సుస్థాపితమై యుండనగును. ధర్మశాసనములు చూడ వచ్చినవారికి చక్కగా తెలియుచుండెను కాబోలు. ఈ విధమైన శిలా ఫలకము మరెక్కడను యింత వరకు లభింపలేదు. బైరట్ (ఢిల్లీ దగ్గర, జైపూరు జిల్లా, రాజస్థాన్)లో నాపరాయిపై శాసన మీకోవకు చెందినదిగా తీసుకోవచ్చును గాని - అది చాల చిన్న ఖండ శాసనము. ఈ సన్నతి శాసనముల ద్వార మౌర్య కాలపు ఆంధ్ర-కర్ణాటక ప్రాంతముల చరిత్రకు కొన్ని నూతన నాంశముల వెలుగుకు తెచ్చినది. ప్రాచీన చరిత్ర పరిశోధన కెంతేని ఉపయుక్తములు. చంద్రలాంబా దేవాలయమున్న స్థలమును విశేషముగా శోధించవలసి యున్నది. పూర్తిగా త్రవ్వకములు కొనసాగించినచో తక్కిన శాసన భాగములు కూడ లభ్యమగుటయే గాక, యీ శిలాఫలక శాసనము యెచ్చట యే విధముగా ప్రతిష్ఠింపబడెనో తెలుసుకో వీలగును.

అధోజ్ఞాపికలు :

1) కపత్రల కృష్ణారావు, శ్రీ చండాల పరమేశ్వరి, కర్ణాటక సంస్కృతీయ సంశోధనే, ఉషా సాహిత్యమాలె, (మైసూరు, 1970), మరియు శ్రీశంకర దేశపాండేయ, శ్రీ చంద్రలాంబ సన్నతి దర్శన, (మరాఠీ, 1966).

2) యమ్. శేషాద్రి, "బుద్ధిస్టు మాన్యుమెంట్సు ఆఫ్ సన్నతి" క్వార్టర్లీ జర్నల్ ఆఫ్ మిథిక్ సొసైటి, (బెంగుళూరు), సంపుటి, 56, పుటలు-35, 37.

3) పి. బి. దేశాయి, "ఏ న్యూ బుద్ధిస్టు సెంటరు", ది జర్నల్ ఆఫ్ కర్ణాటక యూనివర్సిటీ, సోషల్ సైన్సెస్, (ధారవాడ, 1968), సంపుటి-4, పుటలు. 3-8

4) అ. సుందర, "ఎక్సవేషన్సు ఎట్ సన్నతి" 1986-87, పురాతత్వ, సంపుటి-17, పుటలు. 21-24.

5) యు.యన్.ఐ. రిపోర్టు, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, దినపత్రిక, బెంగుళూరు, ఫిబ్రవరి, 1, 1989.

6) "రాక్ యీడిక్ట్సు ఆఫ్ అశోక ఫ్రమ్ సన్నతి, చితాపూరు తాలూకా, గుల్బర్గ జిల్లా, కర్ణాటక" ఇండియన్ మ్యూజియం బులెటిన్ (కలకత్తా, 1989) సంపుటి-22, పుటలు. 7-15.

7) మోర్ అశోకన్ ఈడిక్ట్సు ఫ్రమ్ సన్నతి (కర్ణాటక), రత్న చంద్రికా (న్యూఢిల్లీ 1989), పుటలు 403-417.

8) చిలుకూరు నారాయణరావు మరియు దేశభట్ల లక్ష్మీనరసింహము, అశోక చక్రవర్తి ధర్మ శాసనములు, (రాజమండ్రి, 1928) పుటలు. 22-26. రాయప్రోలు సుబ్రహ్మణ్యం, అశోకుని ఎఱ్ఱగుడి శాసనములు, (హైదరాబాదు, 1975) పుటలు. 32-33.

9) అశోక చక్రవర్తి ధర్మశాసనములు, (1928), పుటలు 32-34 మరియు ఎఱ్ఱగుడి శిలా శాసనములు, (1975), పుటలు 14-15.

10) డి. సి. సర్కార్. సెలెక్ట్ ఇన్‌స్క్రిప్షన్ బేరింగ్ ఆన్ ఇండియన్ హిస్టరీ అండ్ సివిలిజేషన్, (కలకత్తా, 1965) పుటలు-44, నోటు-1.

11) అశోకుని ధర్మశాసనములు (1928) పుటలు-ధౌళి 83-89, జౌగడ 101-103

12) అశోకుని ధర్మశాసనములు (1928) పుటలు 103-105, (జౌగడశిల).

13) సెలెక్ట్ ఇన్‌స్క్రిప్షన్స్, (కలకత్తా, 1965) పుట 44 అధోజ్ఞాపిక-1.

14) సి. ఆర్. కృష్ణమాచార్యులు, ప్రొసీడింగ్స్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ కాంగ్రెసు, (మద్రాసు, 1914), పుటలు-145 మరియు డి. సి. సర్కారు, అశోకన్ స్టడీస్. (కలకత్తా, 1979) పుటలు. 55-56.

# విశ్రాంతి లేని కళ్లు

## ప్రేరణ

కవితా తపస్సులో మునిగి
మెదడు పొరల్లో నుండి, గతం గాయాలను
ఒంపుకొని చప్పరిస్తు వుంటాను.

ఎక్కడో కర్ణకఠోరంగా
ధార పోగులు తెగిపోతున్న శబ్ద
అవి నా నరాలని తెలిసిపోయేసరికి
వళ్ళంతా శెగలు పొగలుగలు వ్యాపిస్తాయి

ధైర్యాన్ని వడకట్టి నిలబడతాను
అనుభవాలు కట్ట కట్టి మోసుకుపోతూ వుంటాను.
నా కళ్ళమధ్య ఆకాశం నిటారుగా నిలబడుతుంది
మంత్రముగ్ధనై పడివడిగా పరుగిడుతుంటాను
నే వెతుకుతున్నదేదో నా కాళ్ళకు తగిలి
ఆగి చూస్తాను
శాఖోప శాఖలుగా విస్తరించిన చెట్టు
నన్నాహ్వానించి తనలో లీనం చేసుకుంటుంది
ఆకుల సందులనుండి వెలుగు రవ్వలు జారిపడుతుంటాయి
అవి కుప్పగా పోసి మనసారా! ఆస్వాదిస్తాను.
చీకటి!! రెక్కలు తెగిన గుడ్లగూబలా
గిల గిలా కొట్టుకుంటుంది
పల్చటి మేఘాలు కుప్పలుగా చేరి చిక్కబడతవి
జారిన చినుకులు విస్ఫులించి, పచ్చి మట్టిని అస్కరిస్తుంది.

గుండెలు తెగిపోయే మెరుపు విఘూర్ణిల్లుతుంది
మెరుపును ఆప్యాయంగా పొదివిపట్టి స్వంతం చేసుకుని
బంగారు కొండలపై కెగబాకుతాను.
అక్కడ రాలిన రక్తపుష్పాలు అనన్య తేజోవంతంగా
పుష్పిస్తుంటాయి
సుందర పరిమళాల్ని ఆస్వాదిస్తుంటాను
విశ్రాంతి తెలియని నా కళ్ళు
నిద్రలోకి జారుకుంటాయి
నే లేసేలోగా.... పిల్లలు
కేరింతలు కొడుతూ....
నా వడిలో వాలిపోతారు.

# మంత్రబలము

## శ్రీ గాడేపల్లి కుక్కుటేశ్వరరావు

### (శ్రీ కావ్యకంఠ గణపతి ముని జీవితములోని ఒక యథార్థ సన్నివేశము)

కలువలాయి యనెడు గ్రామంబు నందొక్క
ద్రవిడ విప్రు వింటఁ బ్రభవమంది,
"కావ్య కంఠ" బిరుద గణపతి - అరుణాచ
లమున మంత్రబల ఫలమ్ము గవియె.

యౌవనంబు నందె యాలిమందలి మోహ
మవలఁ బెట్టి తీర్థయాత్ర లరిగి—
ఒక్క పుణ్యశాలి యుపదేశమున "శివా
య నమ" యన్న మంత్రమును గడించె.

గణపతి రేఁబవళ్లు క్షణకాలము తీరికయైన వ్యర్థ యా
పన మొనరింప కప్పురమ పావన మంత్రజప క్రియైక భూ
షణ హృదయుండునై కడపు. చాలదినమ్ములు మాసముల్ సమల్
చనియె సతందొ యాత్రల వశంబునఁ ద్రిమ్మరు చిక్కడక్కడన్.

అయన తమ్ముఁగుఱ్ఱ యొకఁడన్నను బాయక తోకవెంట వా
రాయణ యట్లు వచ్చె శివరాముఁడు, రాయి డి కోర్వలేని లేఁ
బ్రాయము వాఁడు, సాయమను వంకన పల్ బొగబండి యానముల్
చేయుచు పంతపించు మృదుచిత్తుఁడు, భ్రాతకుఁ బ్రీతిపాత్రుఁడున్

అన్నదమ్ము లిర్వు రాయా మహాతీర్థ
జల విగాహనములు, సకల దైవ
దర్శనములు చేసి, తమిఁ జేరి రదె కాంచి
కాపురంబు - సురల కాపురంబు.

ఆ కాంచీనగంబు ద్రావిడ విశిష్టాచార రక్షా శిలా
ప్రాకారంబు, వికుంఠ ధామ రజతాద్ర్యావాసపుణ్యైక కా
లా కల్పక్షమ మర్ధి కల్పకుజ మవ్యాజప్రణోపేత మ
స్తోక శ్రీద ముదార సత్రగృహ సందోహ ప్రతిష్ఠాకమున్.

ఏకామ్రనాథ కామా
క్షీ కళ్యాణులకు నమ్మచిత్తమ్మువఁ బూ
జా కార్య మన్నదమ్ములు
గ్గై కొని ఘటియించి యూరు గన నరిగి రటుల్.

ఒక జ్యోతిష్కుఁడు మిత్రుఁడై గణపతి జ్యోతిష్య వైదుష్య రీ
లకు ముగ్ధుండయి, యాత్మ పద్మమున నిల్వం జోటు కల్పించి, భు
క్తికి సౌకర్య మొనర్చిపెట్టఁ దగురీతిన్. తృప్తుఁడై మోక్ష కా
రక పంచాక్షరి నాత్మలో జప మొనర్పన్ సాగె నా ప్రాజ్ఞుఁడున్.

ఆ సమీప మందె యాంజనేయ స్వామి
వారి యాలయమ్ము వరలు నొకటి.
జీర్ణదశన యుంట సేవింప రా రెవ్వ
రమ్మరుత్కుమారు నాశ్రయించి.

జన వర్జితమగు నగ్గుడి
గణపతి యేకాంత జప సుఖస్థితి కెంతో
అనుకూల మౌట నటకుం
జని యిపు దపుడనక నెఱపసాగె జపంబున్.

చనె నటు కొన్ని వారములు శ్రద్ధగ మంత్రజపంబు చేయుచున్
గణపతి పుచ్చె. వచ్చిన దొకానొక యుత్తర మందుఁ దండ్రి జ
బ్బునఁ బడెనంచు తక్షణమె పుత్రులు రావలె నంచు నుండె, నౌ
నని యనదమ్ములిద్దరు ప్రయాణము కట్టిరి కల్వలాయికిన్.

అపుడా జ్యోతిషశాస్త్ర మిత్రుఁడనె "ఆర్యా! యింతదూరమ్ము మీ
రెపు డీపై నరుదెంతురొ? రక్తై యరుణాద్రీశున్ సమర్చించి పొం
డు! ఫలించున్ భవయాత్ర" యన్న విని సంతోషించి వారధ్వగ
ప్రపయా నయ్యరుణాచలమ్మునకుఁ బోవన్ సిద్ధులై రర్థిమై.

ఆ యన్నదమ్ము లా దివ
సాయం సమయమున కరుణశ్శైల మరిగి, దే
వాయతనమునకు నడచిరి
ప్రాయత భక్తిప్రవృత్తు లాతుర వెట్టన్

ప్రొద్దువోయిన తలపులు మూయవచ్చు
ననుచు గణపతి యడుగొక్క యంగ గాఁగ
నడచి, యొక సందు వాకిట గుడినిఁ జొచ్చె.
చొచ్చెనో లేదొ దర్శనం బిచ్చె గౌరి.

ఆ చిఱునవ్వు లా వికసితానన మా మృదులేక్షణంబు లా
కాచిన పండువెన్నెల విగారము లీనెడు ఫాల భాగ మా
రోచిరుదాత్త తత్పద సరోజము లా తనుభాసభాస్వరీ
తీ చతురత్వముల్ గణపతిం దలమున్కలు వేసి వైచినన్.

అలదరించి, తల్లి సర్వాంగ కరుణామ
యత్వమునకుఁ బరవశత్వ మంది
చూచుచుండ, దేవి జూటాగ్ర సుమములు
కదలి రాలెఁ జాటి కవికరమ్ము.

ఆ మీఁదట గణపతి శివ
రాములు నరుణాచలేశ్వర ప్రభుఁ గరుణా
ధాము నపీత కుచాంబా
రామాధవుఁ గొలిచి చనిరి గ్రామమ్మునకున్.

గణపతి నవరాత్రోత్సవ
దినముల నది కడమ దినము, దివ్యముగా న
య్యేనిమిది రాత్రులు చన్నవి
జన హృదయ వినోద వివిధ సముచిత సభలన్.

నాఁడేకాదశి, ప్రొద్దువోయె, జనసంఘల్లం జేరుచున్నార్ హరి
క్రీడాగాథల నాలకించి; యదె భ్రాతృ ద్వంద్వ మా రాత్రికే
గూడో నీడయొ చూచికోఁ దలఁచి తిర్గన్ వీధియున్ వీధి. ఆ
పై - దొక్కేడిచి తమ్ముఁగుఱ్ఱ విసిగింపంజొచ్చె నయ్యగ్రజున్.

తినఁ గొనిపెట్టుమంచు విలఁదీసిన 'కాని' యొసంగెనన్న. ఆ
య్యనుజుఁడరంటి పండ్లుగొని యవ్వి తినెన్. మఱి యంతనాగ కిం
కనుగొనిపెట్టు మంచలుగఁగా గణపన్న నిరాకరించి యి
ట్లనె "మితిమీఱి తిన్న నుదరార్తి యగున్ జెడు నున్న స్వస్థతల్.

నడు మే బ్రాహ్మణు కొంపనో యడిగి యన్నంబింత పెట్టింతుఁ జీ
రెడు నీయాకలి" యంచు నన్న యనుజున్ ద్రిప్పెన్ నిశావీధు, లి
య్యెడ యాచించిన లేదు లేదనెడు పల్కే. చిత్రమయ్యెం గడుం
గడు నప్పొంథుల కట్టిగ్రామ మట దన్కన్ జూడఁ బోమిన్ ధరన్.

ఏ యేకాదశి యైన సత్రములు, పోనీ - వాఱ్ఱులేకున్న న
న్యాయం బింధ్లను పిల్లపాపలకు నైనన్ వండి వడ్డింపరా
యీ యూరం గల గేస్తురాండ్రనుచుఁ దర్కింపంగ నే తద్దశా
ప్రాయంబైన పురాణ మగ్గణపతి స్వాంతంబునం దట్టినన్.

"మా భూత్ త్రైపూరుషీ విద్యా
మా భూత్ త్రైపూరుషం ధనమ్
మా భూత్ త్రైపూరుషీ ముక్తిః
కాశ్యాం నివసతాం సదా ..."

అని పయికిం బఠించుకొను చల్లనఁ బిల్లవి తోడనేగు న
య్యనఘుని జేరఁబిల్చి వసుదామర వృద్ధ గృహస్థుఁ డొక్కఁ డి
ట్లనె "తమరేరొ పండిత మహాశయు లిద్ది పఠించుకొంచుఁ బో
వను కతమేమి?" నాఁగ నగి పాంథుఁడు పల్కె గృహస్థుతో నిటుల్

"మే మాంధ్ర బ్రాహ్మణులము
స్వామిని దర్శించిపోవ వచ్చితి మిట, నీ
డా మా తమ్ముఁడు క్షుత్తున
కేమాత్రము తాళలేక యేడ్చుచు నుండెన్.

పెట్టింత మన్న నొక్కరుఁ
బెట్టం డెదన్నమ్ము మిగుల వండుకొనుట
కట్టా! కవ్వింపవి యీ
పట్టున నేనెట్లు దీర్తు వాని క్షుధార్తిన్?"

దానిని విన్న వృద్ధుడు స్మితం బొనరించి వచించె "మాదు భా
గ్యాన లభించినారు తమరయ్యలు! నేడుపవాసముండి మా
దాన నిపిన్ ద్విజద్వయికి శ్రద్ధ నపోసన మీదలంచి, యే
రే నరుదెంతు రంచిదె నిరీక్షణ చేయుచునుండె వంటయై.

మీదును మిక్కిలి నేడే
కాదశి తిథి యగుట భోక్తగా రా నొక్కం
డీ దరిదాపులం గనబడ
డాదిత్య సుదాంతు లట్టు లగపడితి రిటన్.

ఇదె మాగేహము రండు లోపలకు- మా వృద్ధావ్రతంబున్ జయ
ప్రదముం జేసి యనుగ్రహింపవలె విప్రద్వంద్వమా!" యంచు న
మ్మది యర్థించె, సహోదర ద్వయము సమ్మోదంబునం జేరి రా
సదనాంతస్స్థలి కన్న లాభశుభ విశ్వాసాంత రంగంబులన్.

నడవలం బంచల దీపము
లిడియుంచిరి. గోమయమున నిల్లలికిరి. ము
గ్గిడి రట్టులే వెలుపలి పె
రడునన్ దులసమ్మ చుట్టు ప్రమిదలిడి రౌగిన్.

ఇంటిలో నుండి వృద్ధగేహిని యొకర్తె
ఎదురుగా వచ్చి మడిబట్ట లిచ్చి చనియె.
కడిగికొని కాళ్లు దోవతుల్ తడిపివైచి
మడుగులన్ దాల్చె నన్న తమ్ముడును దాను.

గణపతికిం గూడ నియమ మేకాదశి తిథి
ననశనం బైన నా రాత్రి తినదలంచె
పెద్ద ముత్తైదువ వ్రతంబు వృథ యొనర్ప
మనసు రాకుంట దైవకల్పనము వెంట.

అమ్మది యవ్వ వండిన పదార్థము లద్భుతముల్, సుధాన్న మి
త్రమ్ములు, దొడ్డవడ్డన లుదారము లాదరణల్ స్వమాతృ వి
ధమ్ములు, సాత్త్వికత్వములు దైవతముల్. మొగమోటలేక, యా
తమ్ముడు నన్నయుం దినిరి తత్తదుదాత్త సమస్త భక్ష్యముల్.

పారణ పూర్తియై తెలుగు బావలు పంచ యరుగు మీదికిం
జేరిరి. గేహి దక్షిణలు నిల్పిన తమ్మలముల్ సహోదరో
దారుల చేతికిచ్చి "యిదె ధన్యుల మైతిమి. మేను వాల్చుడం
బోరగ వైచి ద్వారము గృహోదర భాగము చేరె నవ్వుచున్.

ఇద్దరకు గడియ లోపల
నిద్దుర పట్టినది. సగము నిసి కడ వెసన
య్యిద్దరకు వచ్చె మెలకువ
నిద్దుర పెద్దమ్మ వదలి నెటి నరుగుటచే.

లేచి యిట్టు నట్టు చూచి రంతయును న
గమ్య గోచరముగం గానం బడియె—
రేయి వారు తిన్న గృహమేని, గృహ మేధు
లేని యున్నచోటం గానరారు.

తులసి కోట లేదు. అలికిన నడవలు
గదులు లేవు, మదుల మదులు లేవు.
పీడి జాతి యరుగు మీద మేనులు వాల్చి
పవ్వళించి యున్నవారు - వారు.

జరిగిన దెల్ల నిద్దరకు స్పష్టముగా గుఱుతుండె - వృద్ధ భూ
సురుడు క్షణించుటల్, వ్రతము చొప్పన నమ్మది యవ్వ వండి, య
య్యపురి కట్ల పోసనము లిచ్చుటల్, కాకరికాయ కూరయున్
బెఱుగులు, పాయసమ్ములును, పెట్టిన నంజుళు లొక్కరూపునన్.

తెల్లవారె మెల్ల మెల్లన. గతరాత్రి
యింటి ముదిత వచ్చి యిచ్చి చన్న
దక్షిణలును, పండ్లు, తమ్మలపాకులు
పెట్టియుండె నచట పెట్టినట్లె.

ఆ యెమటం జిన్న గణపతి
కోయిల గలదొకటి అపుడె గుడి తెఱచుటకై
యాయత్తం పడి పూజరి
కాయలు పూల్ కప్పురంబు గంధము తెచ్చెన్.

తామాత్యమ్ముగ గొన్న యాగృహము తత్ప్రాంతంబు నందేదనో
యే మార్గమ్ములనో యుండవచ్చునని యెంతే పట్టియుం బట్టి వా
రా మధ్యాహ్నము దాఁక బల్ వెదకి లేదన్ నిశ్చయం బౌట-గౌ
రీ మాతృత్కరుణా ప్రదర్శనముగా హృద్వీధి దర్శింపరే.

గణపతి శివరామునితో
ననియెను "పంచాక్షరీ మహామంత్ర జపం
బనుజాఁద! ఫలియించెనురా!
విన మొన్నట పంచకోటి నిండినదేమో!"

* * *

అతఁడు గణపతి, గౌరీ
మాతకు సాష్టాంగపడుచుండె మఱి. శాన గిరి
ధ్యాతయె సుతు ముద్వాధా
పాతము తొలఁగంగ పండి వర్ధించుకొనెన్.

("నాయన" అను గ్రంథ మాధారముగా)

# కళ్ళు

ఆకలి కళ్ళతో చూస్తున్నా-
అందంగా ఆకాశంలో అతికిన
అర్కుడూ చంద్రుడూ తారలూ
అణాకాణీకి చెల్లని
అస్తిత్వం లేని
అస్తిపంజరాల్లా కనిపిస్తున్నయ్!

పచ్చలారని
పసికందులా పరికిస్తున్నా —
పంకజనాభు డీధరతిని
పక్కన నా కోసమే సృజించినట్టు
ప్రవచించే ప్రత్యణువూ
పంచామృతా లొలికించే
పైసితల్లి స్తనాల్లా కనిపిస్తున్నయ్!

స్వర్గం నరకం స్వర్ణం గరళం
జననం మరణం జరామరత్వం
స్నేహం ద్రోహం శీతం ఉష్ణం
ఖడ్గం కమలం కవనం కపటం
ఇంతీ బంతీ ఇరుగూ పొరుగూ
ఎరుపూ పసుపూ నలుపూ తెలుపూ
వురికే ఊసరవెల్లి రంగుల్లా మారుతూ

ఎలాంటి చూపు కలాంటి దృశ్యాన్ని సృష్టిస్తూనే
క్షణంలో అంధకారాన్ని బంధిస్తూ
కలలాంట ప్రపంచాన్ని
కమ్మగా జుర్రుకుని మింగేసే
కాలానికి గాలా లీ కళ్ళు!

శ్రీ ఏల్చూరి విజయ రాఘవరావు

# చర్మవ్యాధులకు




## అతి గాఢంగా పనిచేసే అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెం

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ ఆయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు ప్రవేశించలేవు. కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంటు మాత్రము లోపలకు ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది. అమృతాంజన్-డెర్మల్ ఆయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు ఆదర్శమైన నివారిణి. నేడే కొనండి!

**అమృతాంజన్ లిమిటెడ్** 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004



**Amrutanjan Limited**

157-TG

## డాక్టర్ గుమ్మా సాంబశివరావు

# జానపదుల స్మృతి గీతాలు

జనపదం అంటే పల్లెటూరు. పల్లె ప్రాంతాలకు సంబంధించిన ప్రజలే జానపదులు. జానపదుల సాహిత్యమే జానపద సాహిత్యం. పల్లె ప్రాంతాల్లో నివసించే ప్రజలు పొలం దున్నే సమయంలోనో, కలుపు తీసే సందర్భంలోనో, కోతలు కోసేటప్పుడో, కుప్ప నూర్చే పన్ని వేళంలోనో, బళ్ళమీద సవారీలు తీస్తున్న బాటల్లోనో ఉల్లాసంగా పాటలు పాడుకొంటారు. వీరికి విద్యాగంధం లేకపోయినా భావ దారిద్ర్యం మాత్రం లేదు. నిసర్గమనోజ్ఞమైన పదజాలంతో, పండిత కవులకు తీసిపోని ఉపమానాలతో, చక్కని కల్పనలతో, స్వచ్ఛమైన మనసుల నుంచి పెల్లుబికే భావాలతో పాటలు కట్టి పాడుకొంటారు.

జానపదులు సందర్భాల కనుగుణంగా పాటలు కట్టి పాడుకొంటారు. సంతోషం పొంగి పొర్లినప్పుడు ఉల్లాస భరితమైన పాటలు పాడతారు. దుఃఖ సముద్రంలో మునిగినప్పుడు కరుణరస ప్రపూరితాలైన పాటలు పాడుతూ శ్రోతల హృదయాల్ని ద్రవింపజేస్తారు. వీరి కరుణరసాత్మకమైన గేయాలు వింటున్నప్పుడు ఎంతటి కఠినచిత్తుడైనా కరగక మానడు.

జానపద గేయాలు శ్రామిక గేయాలు, కథా గేయాలు, స్త్రీల గేయాలు, బాల గేయాలు, పారమార్థిక గేయాలు, వేడుక పాటలు, వలపు పాటలు, హాస్య గీతాలు, శోక గీతాలు మొదలైన రీతిలో అనేక రకాలుగా ఉంటాయి. శోక గీతాలు, కన్నీటి పాటలు, స్మృతి గీతాలు ఒక కోవకు చెందుతాయి. హృదయాన్ని ద్రవింపజేసే జానపదుల స్మృతి గీతాలను వివరించడమే ప్రస్తుత వ్యాస ప్రధానోద్దేశం.

జానపద గేయాలకు సంబంధించిన అనేక అంశాలమీద పరిశోధన సాగింది. స్మృతి గీతాలను గూర్చి ప్రత్యేకంగా పరిశీలన సాగలేదు. స్మృతి గీతాన్ని లేదా స్మృతి కావ్యాన్ని ఆంగ్లంలో 'ఎలిజీ' అంటారు. దీన్నే శోక గీతమని, శోక కావ్యమని కూడా పిలుస్తారు. 'ఎలిజీ' అనే పదం 'ఎలిగాస్' అనే గ్రీకు పదం నుంచి వచ్చింది. 'స్మృతి'కి జ్ఞాపకం, తలంపు, ధర్మశాస్త్రం, అలంకార విశేషం, స్మరణం, ఎడతెగని అభిలాష, బుద్ధి అనే నైఘంటికార్థాలున్నాయి. ఈ స్మృతి గేయాలు వస్తువును పురస్కరించుకొని అనేక రకాలుగా ఉంటాయి.

తమకు ఆప్తులైనవారు, ఇష్టులైనవారు, సన్నిహితులైన వారు మరణించినప్పుడు దుఃఖం పెల్లుబకడం సహజం. తమ కిష్టమైన వారి దేహం పాంచభౌతికమైన ప్రకృతిలో లీనమైనప్పటికి వారి స్మృతి వీరిని వెంటాడుతూనే ఉంటుంది. వారి వారి సంబంధాల్ని పురస్కరించుకొని దుఃఖిస్తారు. వారిని స్మరిస్తూ శోక గీతాలు పాడతారు. తమను తాము ఓదార్చుకొంటారు. ఈవిధంగా మరణించినవారి విషయాలను స్మరిస్తూ పాడే పాటలే, అల్లుకొన్న కావ్యాలే స్మృతి గీతాలుగా, స్మృతి కావ్యాలుగా ప్రసిద్ధి కెక్కాయి. ఇలాంటివి జానపద సాహిత్యంలో అసంఖ్యాకంగా ఉన్నాయి. ఈ స్మృతి గీతాలను వీరనాయక స్మృతి, మిత్ర స్మృతి, సతీ స్మృతి, పతి స్మృతి, పుత్ర స్మృతి మొదలైన రీతిలో పేర్కొనవచ్చు.

### వీరనాయక స్మృతి :-

వీరులైన నాయకులు వీరమరణం పొందిన సమయంలో లేదా ఇతరు లెవరైనా తమ నాయకుని దొంగచాటుగా చంపిన సందర్భంలో ప్రజల హృదయాలు దుఃఖ పూరితాలవుతాయి. ఆ దుఃఖంలో తమ నాయకుని గొప్పతనాన్ని, సాహసాల్ని స్మృతికి తెచ్చుకొంటూ పాటలు కట్టుకొంటారు. ఆ పాటల్ని పాడుకొంటూ తమను తాము ఓదార్చుకొంటారు. ఇలాంటి పాటల్లో 'అమరజీవి కొమరయ్య' పాట తెలంగాణాలో బాగా ప్రచారంలో ఉంది. నల్లగొండ జిల్లా జనగామ తాలూకాలో విసునూరి దొర తనను వ్యతిరేకించిన వాళ్లను హత్య చేయించేవాడు. లూటీలు జరిపించేవాడు. ఆ సమయంలోనే ప్రజా నాయకుడైన కొమరయ్యను హత్య చేయించాడు. తమ నాయకుడైన కొమరయ్య మరణాన్ని స్మరిస్తూ ప్రజలు పాటలు కట్టారు. మీటింగు జరుగుతున్న సమయంలో విసునూరి దొర పంపించిన రౌడీలు తమ నాయకుని చంపారని ఇలా పాడుకొన్నారు.

"కష్టజీవుల పల్లి
కడివెండి గ్రామములో
కొమరయ్య మల్లయ్య
అన్నదమ్ములు వారు
సాయంత్రమూ వచ్చి
అన్నమ్ము తిన్నారు
బహిరంగ సభయని
బాజారు కొచ్చిరి
అందరూ కలసిరీ
మీటింగు బెట్టిరి
జై జై లు మిన్నుముట్టంగా జై యాంధ్ర
మహాసభకు జై కొట్టినారో
విసునూరి దొరబంట్లు.
మిస్కినల్లి రౌడీలు
కలవరపడి బాగ
కల్లు సారా తాగి.........
కైపులో మత్తులో
కండ్ల కావరమెక్కి
గురి చూచి గుంపుపై
తూట తుపాకెత్తి
కాల్చేరా పక్కిరామదూ, దెబ్బ పేల్చేరా....
కాళ్లకు తగినోళ్లకు, కాళ్లకు తగిలాయి
చేతులకు తగినోళ్లకు, చేతులకు తగిలాయి
కొమరయ్య కొక్కనికి డొక్కలో తగిలింది"

—ఇంకా కొమరయ్య చేసిన సాహసకృత్యాల్ని స్మరిస్తూ, తెలుగుతల్లి బంధాలు తెంచివేయడానికి ప్రాణాలు అర్పించాడని, విసునూరు దేశముఖు దగ్గర ఉన్న ధాన్యాన్ని బట్టబయలు చేసి ప్రభుత్వానికి పట్టించాడని, తమ నాయకుని చంపిన నీచుల అంతు చూస్తామని ప్రతిజ్ఞ చేస్తూ పాటలు పాడుకొన్నారు.

రాయలసీమలో నరసింహారెడ్డి గొప్పతనాన్ని, ధైర్య సాహసాల్ని స్మృతికి తెచ్చుకొంటూ పాడే పాట బాగా వ్యాప్తిలో ఉన్నది. నరసింహారెడ్డి రాయలసీమలోని కోయిలకుంట్ల పరిసర ప్రాంతాల్ని పాలించాడు. ఇతడు 19వ శతాబ్ది ఆరంభ కాలంలో ఉన్నాడు. ఆంగ్లేయుల కుంఫినీ దొరతనాన్ని ఎదిరించి వీర మరణం పొందాడు. ఆ ప్రాంతంలో కుంఫినీ దొరల గుండెల్లో నిద్రపోయాడని పల్లీయులు ఈనాటికీ ఆ వీరుని మరణాన్ని కోలాటం వేస్తూ వినిపిస్తూ ఉంటారు.

"దొరవారి నరసింహ్వారెడ్డి
నీ దొరతనము కూలిపోయె - రాజా నరసింహ్వారెడ్డి ॥దొర॥

రేనాటి సీమలోన రెడ్డోళ్ల కులములోనా
దొరవారి వంశాన ధీరుడే నరసింహ్వారెడ్డి ॥దొర॥

కోయిల కుంట్లా గుట్టలెంటా
కుందేరు వొడ్డు లెంటా
గుర్రమెక్కి నువు వస్తే కుంపిణీకి-గుండె దిగులూ ॥దొర॥"

—ఈ విధంగా ఆ వీరుని మరణాన్ని స్మృతికి తెచ్చుకొంటూ అలాంటి ధైర్యసాహసాలు, త్యాగగుణం ప్రజలు అలవట్చుకోవాలని కోలాటం వేస్తూ పాటలు పాడుతూ పల్లెప్రజలు దర్శన మిస్తారు. ఇలాంటి గేయాలు జానపద సాహిత్యంలో కోకొల్లలుగా ఉన్నాయి.

సతీ స్మృతి :-

అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్య, అన్యోన్యంగా మెలగుతూ, నిన్న మొన్నటివరకూ తనను ఆనందసాగరంలో తేలియాడించిన భార్య మరణిస్తే భర్త దుఃఖించకుండా ఉండ లేడు. సంసార రథానికి రెండు చక్రాలైన భార్యాభర్తల్లో ఏ ఒక్కరు తొలగిపోయినా ఆ సంసార రథం సాగదు కదా! అందుకే తమ వలపుల్ని తలపుకు తెచ్చుకొంటూ, గత దాంపత్యాన్ని తలచుకొంటూ తన భార్య మరణానికి దుఃఖిస్తూ ఒక జానపదుడిలా పాడుకొంటున్నాడు.

"సుద్ది బొందలకాడ - నీ సుద్ది దియ్యంగానె
సద్ది దిన్నట్టాయె సిలకా - సిన్నారి సిలకా
ఇంతెల్ల మెద బాసెనే
ఎంత పాపపు దేవుడే సిలకా
సమర్తపై నీవు సాటుకు కూకుంటె-సత్తెబామావందురే సిలకా
పసిద్దె మవ్వాకక్క పందిట్ల కూసుంటె-పార్వతీ దేవందురే సిలకా
ముత్తైదుపై మవ్వాకక్క మూలకు కూకుంటె-ముద్దబంతీవందురే
సిలకా

ఇద్దరమూ తినేటి ఆ బొద్దు గిన్నెలా
ఒక్కనికి ఒనరాయెనే పిలకా - పిన్నారి పిలకా
ఇద్దరమూ కొప్పేటి మద్దికాయల దువ్వటి
ఒక్కనికి ఒనరాయెనే పిలకా - సిన్నారి పిలకా"

—తన భార్యలో సత్యభామను, పార్వతీదేవిని, ముద్దబంతిని చూచుకొన్న భావుకు డీ జానపదుడు. ప్రజలంతా అలా భావిస్తారని పైకి అంటున్నాడే కాని నిజానికి అవన్నీ అతని భావనలే. వారిద్దరూ ఒకే కంచంలో తినేవారట. కాని తన భార్య లేక పోవడంవల్ల ఆ కంచం తనకు మాత్రమే పరిమితమైందని బాధ పడుతున్నాడు. తమ దాంపత్య స్మృతులు తనను వెంటాడుతున్నాయి కాబట్టే ఇద్దరూ తప్పుకొనే దువ్వటి ప్రస్తుతానికి తనకు మాత్రమే మిగిలిపోయిందని విలపిస్తున్నాడు. ఈ పాటలో జానపదుని అమాయకత్వం వారి అన్యోన్య దాంపత్యం ప్రత్యక్షంగా లోను దర్శనమిస్తున్నాయి.

**పతి స్మృతి :-**

భార్య మరణాన్ని తట్టుకోలేని జానపదుడు విలపించినట్లే తనకంటే ముందు తన భర్త మరణించిన సమయంలో తమ దాంపత్యాన్ని తలచుకొంటూ, పతిని స్మృతికి తెచ్చుకొంటూ జానపద స్త్రీ విలపించే పాటలు కూడా జానపద సాహిత్యంలో ఉన్నాయి. భర్త మరణించిన సమయంలో దుఃఖిస్తున్న జానపద మహిళ ఆవేదన మీ విధంగా ఉంది. పెళ్లినాటి వేడుకల్ని తలపోస్తూ—

"కానరాని గట్లమీద; చందమామ వోలె చందమామ
మన ఇద్దరికీ తలంబ్రాలు „ „
బాయిలోన బల్లి పలికె „ „
బన్న సరము కొలుకులూపె „ „ "

—అని దుఃఖించింది.

—శుభంగా తలంబ్రాలు పోసుకొంటున్న సమయంలో బావిలోని బల్లి పలికిందట. ఆ దెబ్బకే వెంటనే తెగిపోరాని బన్నసరము తెగిపోయిందట. ఈ రకంగా తమ వివాహ సందర్భంలో తటస్థించిన అపశకునాల్ని తలచుకొంటూ దుఃఖించింది. ఇలాంటి గేయాలు చాలా పరిమితంగా ఉన్నాయి.

**సఖి స్మృతి :-**

తమ మిత్రులు, తమతోపాటు నిన్న మొన్నటివరకూ అన్యోన్యంగా ఉన్నవారు మరణిస్తే, ఆ మరణించే వ్యక్తికి తమకు ఉండే సన్నిహితత్వాన్ని తలచుకొంటూ విలపించే గేయాలు కూడా జానపద సాహిత్యంలో ఉన్నాయి. ప్రతిరోజూ తనతో ఆడుకొనే చెలికాడు చనిపోయాడు. వారిద్దరూ కలసి ఆటలాడిన తీరు స్మృతికి తెచ్చుకొంటూ ఒక బాలిక విలపిస్తూ తన తోటివారితో ఇలా అంటున్నది.

"బొంగురా లాడేటి బొగు డల్లా నాయిరాజా
యాడవెంకిన లేదే యెలదారి „
చిర్రగోనె లాడేటి చింతల్ల „ ॥యాడ॥
గోటిలాడేటి కోవల్లా „ ॥యాడ॥
నిన్న మనమాడిన నిమ్మల్ల „ ॥యాడ॥
మొన్న మనమాడిన మోతుకుల్ల „ ॥యాడ॥
చెండూలు ఆడేటి చెలుకల్ల „ ॥యాడ॥

—నిన్న మొన్న వాళ్లు ఆడుకొన్న ప్రాంతాల్లో ఎక్కడ వెదికినా చెలికాడు కనిపించలేదని బాలిక విలపిస్తున్న తీరు సహృదయులకు కంటతడి పెట్టిస్తుందనడంలో సందేహం లేదు.

**పుత్ర స్మృతి :-**

పుత్రుడు పుట్టినప్పుడు తల్లిదండ్రులు పొందే ఆనందం వర్ణనాతీతం. అలాగే ఆ పుత్రుడు మరణిస్తే వారు పొందే దుఃఖమూ అనంతం. వార్ధక్యంలో తమను ఆదుకొంటాడు, ఆదరిస్తాడు అని ఎదురుచూసే తల్లిదండ్రులకు తమ కోరిక తీరక ముందే, తమ చేతులమీద పెరిగిన పుత్రుడు, తమ కళ్ల ఎదుట మరణిస్తే ఆ వ్యధను తట్టుకోవడం కష్టం. అందులోనూ తమ పుత్రుడు వీరుడై మరణిస్తే ఆ బాధ ద్విగుణీకృత మవుతుంది. ఇలా పుత్ర మరణాన్ని స్మృతికి తెచ్చుకొంటూ జానపదులు పాడే పాటలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. వీటిలో రాజామానందరెడ్డి పాట ప్రముఖమైంది.

"రాజామానందిరెడ్డి, కొడుకా మానందిరెడ్డి
ఏ కిలలో ఐత్తెము తీరేనా
మల్లువంచె కట్టుకోని
నల్లకోటు తొడుక్కోని
వల్లెవాటు వేసుకోని
కట్టమీద పోతావుంటే
కలకచేరనుకొంటి కొడుకా ॥రాజా॥

మన్నంగా తలదువ్వి, నూగాయ జడవేసి
సందువెంటా పోతావుంటే
సందమామనుకొంటి కొడుకా ॥రాజా॥

వచ్చిపొయ్యే దోవలోనా
దానిమ్మా చెట్టు క్రిందా
వెండి కుచ్చే నేలబడితే
ఏటుకే తెగనరికిరన్నా ॥రాజా॥"

—తన కొడుకు అందాన్ని, దయనీయమైన మరణాన్ని స్మరిస్తూ విలపిస్తున్న తల్లి హృదయం ఈ గేయంలో గోచరిస్తున్నది.

ఇలాగే గుర్రాల గోపిరెడ్డి పాట కూడా పలనాటిలో నేటికి ప్రచారంలో ఉన్నది. గోపిరెడ్డి రూపాన్ని, మరణాన్ని తల్లి స్మృతికి తెచ్చుకొంటూ ఇలా విలపించింది.

"ఓ గుర్రాల గోపిరెడ్డి
దాచేపల్లికి దానమైతివా
వయ్యారి కొడకా, బంగారు కొడకా ॥ఓ॥

శేరు శేరు ఎండి ముంగులు
సేతులాకు పెట్టుకోని
కట్టమీద పోస్తూ ఉంటే
కలకటేరనుకొంటి కొడకా ॥ఓ॥

ఆ ప్రక్క ఒక చేను
ఈ ప్రక్క ఒక చేను
నడుమనా నాపచేను
సందున నిను నలుగురు బట్టి
నరికిరి కొడకా వయ్యారి కొడకా ॥ఓ॥

—తన కొడుకులో కలెక్టరును చూసుకొని మురిసిపోయిన తల్లి మురిపెం తాత్కాలికమే అయింది. అలాంటి కొడుకును నలుగురు పట్టి నరికిన విషయాన్ని స్మృతికి తెచ్చుకొన్న తల్లి హృదయం బద్దలు కాక మానుతుందా? ఆమె గుండెల్లో కొండలు కరగకుండా ఉంటాయా?

పేదవాళ్లకు మేలుచేసే తన కొడుకు ప్రాణాలు పోయినందుకు బాధ పడుతున్న ఒక తల్లి దుఃఖం మనకు గేయ రూపంలో దర్శనమిస్తున్నది. పండుగ సాయన్న సంస్థానాల్ని, భూస్వాముల్ని, ధనికుల్ని దోచి, ఆ డబ్బుతో పేదల పెళ్లిళ్లు చేసేవాడు. అతని సాహసాన్ని స్మరిస్తూ తల్లి ఇలా దుఃఖించింది:

"దొంగతనం లేదురా కొడకా
వొద్దు వొద్దు సాయిలన్న-పండుగోళ్ల సాయిలన్న
వద్దన్నా నే పోతా
పొమ్మన్నా నే పోతమ్మా
గద్వాలకోట లేపినాడే - గద్దువాలా దోపినాడే
తెల్లవార్లూ లేపినాడే - ఉన్న ఇండ్లూ దోపినాడే
ప్యాదోల్ల పెళ్లిళ్లు చేసినాడే
పావురామోలె లేపినాడే - పాలమూరు దోపినాడే"

—పండుగ సాయన్న పాలమూరు మండలంవాడు. సాహసవంతుడు. తల్లి పేరు సాయమ్మ. వనపర్తి, గద్వాల మొదలైన సంస్థానాధీశుల్ని గడగడలాడించాడు. చెప్పిన సమయానికి సంస్థానాల్ని, ధనికుల్ని దోచి పేదల పెళ్లిళ్లు చేసేవాడు. జానపద మాతృ పుత్రవాత్సల్యం పై గేయంలో స్పష్టం. గద్వాల, పాలమూరు మొదలైన సంస్థానాల్ని దోచిన తన కొడుకు పరాక్రమాన్ని తనకు నిత్యం పరిచయంలో ఉన్న గద్ద, పావురాల పరాక్రమాలతో పోల్చి విలపించడంతో సహజత్వం ప్రత్యక్షరం లోను స్ఫురిస్తున్నది.

ఈ విధంగా జానపద సాహిత్యాన్ని పరిశీలిస్తే అనేక విధాలైన స్మృతి గీతాలు దర్శనమిస్తాయి. ఇప్పుడు జానపద సాహిత్యం మీద బాగా పరిశోధన సాగుతూనే ఉన్నా అది ఇంకా బహుముఖీనంగా సాగి, జానపద సాహిత్యసంపద రక్షణకు విశేషమైన కృషి జరగవలసిన అవసరం ఉందనడంలో అతిశయోక్తి లేదు.

## ఉపయుక్త గ్రంథాలు :—

1. డా॥ గంగప్ప; ఎస్. తెలుగుదేశపు జానపద గీతాలు, 1976.
2. గంగాధరం; నేదునూరి; మున్నీరు-1973.
3. డా॥ తిరుమలరావు జయధీర్ - తెలంగాణా రైతాంగ పోరాటం.
4. డా॥ రామరాజు, బి., తెలుగు జానపద గేయ సాహిత్యము 1958.
5. డా॥ వసుంధరారెడ్డి చింతపల్లి; తెలుగు జానపద సాహిత్యము-స్త్రీల గేయములలో సంప్రదాయము - 1986.
6. సుందరం, ఆర్వీయస్; తెలుగు-కన్నడ జానపద గేయాలు 1979.

## స్మృతుల పరిమళాలు

జ్ఞాపకాలు చిత్రాతిచిత్రమైనవి!
తటిల్లతలా చటుక్కున మెరిసి
ఉల్లాన్ని ఉప్పొంగిస్తాయి ఒకసారి.
కృంగిపోయేలా చేస్తాయి మరోసారి.

ముత్యాలు కురిసే పసిపాప బోసినవ్వు,
పరుగులు తీసే తువ్వాయి,
వాన నీటిలో జారిపోతున్న
తెల్లటి కాగితం పడవ....
బాల్యంలో చిలిపి చేష్టలు స్ఫురణకొచ్చి
కలుగుతుంది ఎంతో ఆనందం.

(ఆజారే....పరదేశీ....)
తలపుల తాపుల్లో కదిపి కుదిపే లత పాట.
పదే పదే వినిపించిన
నెచ్చెలి వెచ్చ వెచ్చని జ్ఞాపకాలు
మధుర మధురంగా
పురి విప్పిన మయూరంలా
మదిలో చేసే లాస్యం....

నవ్వుతూ, తుళ్లుతూ వెళ్లే
యువజంటను చూసి,
కలల పట్టుపాన్పు మీద
మొగలిపూల సుగంధంలో
నడిపించి దూరమైన ప్రియురాలు
స్ఫురణకొచ్చి దిగుతుంది గుండెల్లో ముల్లు.

ఓ పాట చాలు
ఓ మాట చాలు
జ్ఞాపకాల వెల్లువ చుట్టెయ్యడానికి!
ఓ దృశ్యం
ఓ శిల్పం
ఓ నాట్యం
ఓ కవిత
ఓ నవ్వు చాలు
స్మృతుల పరిమళం
మదిని ఉయ్యాల జంపాల
ఊపడానికి....

## పారిజాతమే ఓ పదంగా ....

నాకొక పదం కావాలి
ఒకే ఒకటి!

పాడిన పాటే పాడి పాడి
అరిగి, విరిగి
నోళ్లలో నాని నాని
కాగితాలపై కాపురం చేసి చేసి
రంగు వెలసిన బొమ్మలాంటి
పదాన్ని కాదు నేనడిగేది!

అక్షర తూణీరంలోని
సవాలక్ష పదాలు
మదించిన మేధస్సుల్లో
పల్లవించిన ఊహల్లో
ఎన్నెన్నో రూపాలను దాల్చి
వన్నె తరిగి వికృతంగా నిలిచాయ్!
అందుకే ఇప్పుడో పదం సత్వరమే కావాలి.

సుతిమెత్తటిది - మబ్బు తునకలా,
గాలిలో తేలే దూదిపింజలా ఉండాలది!
పసిపాప బోసినవ్వంత సహజంగా
వెన్నెల కురిసినంత ఆనందంతో
సెలయేటి నడకలా నిరాడంబరంగా
కోయిల పాటంత హాయిగా
రవివర్మ కుంచెలో సొగసులా
నవ్య నవనీతంగా
దివ్య పారిజాతంగా
అప్పుడే కళ్లు దిద్దుకొన్న శిల్పంలా
ఓ పదం కావాలి.

## కలల పట్టుపాన్పు

నీ జ్ఞాపకాల ఉలిపొర కాగితాలు
సుతారంగా కాస్తంత కదిల్తే చాలు
రంగు రంగుల తెరలు
ఒకటి వెంట ఒకటి
గాలిలో తెరుచుకొంటూ
ముడుచుకొంటూ దూరంగా
సాగిపోతున్నట్టు.
నీ స్మృతి ఒక్కొక్కటే ముందుకొచ్చి
గుండెను మోగించి, జర జరా
ముందుకు జారిపోతూ,
వాన చుక్కల్లా మరో తలపును
ముందుకు తోస్తూ.
కలల పట్టుపాన్పుపైన నడిచిన క్షణాలు
కోరికల భోగిమంటల చుట్టూ
కొవ్వొత్తులుగా యవ్వన పూగుత్తులను
రాల్చిన క్షణాలు.
నీ నవ్వులో మువ్వలు రంగరించి
షెహనాయ్‌గా నా మదిని చుట్టేసిన
ఆ నిమిషాలు.
పాలరాతి బొమ్మలకే పాఠాలు చెప్పే
నీ వంటి నునుపు రేడియంలా
కళ్ల ముందు మెరుస్తూ.
కన్న కలల ఇంద్రధనుస్సు
తెగిన దండలా పూలను రాల్చేసి
బతుకును ఎడారిగా చేసి
దూరమైన నీకై చేతులు చాస్తూ....

## నేలతల్లి

పసిడికొండలా నిలిచిన ధాన్యం కుప్పముందు
ఆకలితో కూర్చున్నా,
క్యారియర్ రెక్కలు విప్పుతూ.

పొలంలో మది
తల్లి ఒడిలా అనుభూతినిస్తోంది!
గుండె ఆర్ద్రమై నన్నటి కన్నీటితెర.

ఇన్నేళ్లుగా,
నాగరికత కీకారణ్యంలో చిక్కి
అందని పెన్నిధి కోసం వెతికి వేసారి
తిరిగి భూదేవి గుడికే చేరాను!
పరుగు పరుగున అమ్మను చేరే పిల్లల్లా
చేతివేళ్లు భూమిని తాకాయి.
పులకలెత్తిన ఆనందం లోలోపల
నెమలిలా నృత్యం చేసింది!
తల్లి చేతుల్లా మెత్తగా,
బుజ్జగింపులా హాయిగా ఉంది నేల!
ఎన్నో సంవత్సరాలకు తిరిగి ఇప్పుడు
అమ్మను చూస్తున్నట్లుంది!
నీకిక దూరం కానని
ఒట్టేసి చెప్పాలనుంది
భూదేవికి!

## మౌనగానం

నయనాలు
మౌనగానాన్ని
వినిపిస్తుంటే,
మనసులు జాజులుగా పరిమళిస్తూ
పులకరించి,
మాటలు రెక్కలు ముడుచుకొన్న
పక్షులై పోతాయి.
అందంగా పరుచుకున్న నిశ్శబ్దం
ఏ శబ్దం వినిపించినా,
గాజులా బద్దలై
శకలాలు చెల్లాచెదురుగా
చూపులు కలవరపడిపోతాయి.
కళ్లు ట్రాన్స్‌పరెంట్‌గా
భావాలను ఇచ్చిపుచ్చుకొంటుంటే
మది
ఆనంద చంద్రోదయమవుతూ....

**శ్రీ కొడిమెల శ్రీరామమూర్తి**

డాక్టర్ యస్. యల్. యస్. ఆచార్య

# మేఘసందేశం
## నాటి సాంఘిక స్థితిగతులు

కవి కులగురువగు కాళిదాస మహాకవి కావ్యాల్లో మేఘదూతం ఒక ప్రత్యేక ప్రతిపత్తి గల మహాకావ్యం. రసలుబ్ధులైన సంప్రదాయజ్ఞులకు, ఆధునిక దృక్పథం కల విమర్శకులకు తనదైన ప్రత్యేకతను భిన్న భిన్న కోణాలనుండి చూపించగల ఉత్తమ కావ్యం మేఘదూతం లేక మేఘసందేశం. మేఘదూతంలో యక్షుడు తన ప్రియురాలికి సందేశమంపే సందర్భంలో రామగిర్యాశ్రమం నుండి అలకానగరం వరకున్న మార్గవర్ణనతో పాటు "అలక" మొదలైన నగరాల వర్ణన, యక్షుని గృహవర్ణన, సందేశం మొదలైనవి ప్రధానంగా కనిపిస్తాయి. ఆయా సందర్భాల్లో పట్టణాలు, పల్లెలు, అందలి స్త్రీ పురుషులు, దేవతలు, దేవాలయాలు మొదలైనవి వర్ణించు తావుల్లో ఆనాటి సాంఘిక స్థితిగతులు కొన్ని వర్ణితాలు. కవి ఎంత స్వతంత్రుడైనా పూర్వ సంప్రదాయ పరాయణుడై పురాణాదులనుండి కావ్యకథావస్తువును పరిగ్రహించినా, ఎంత సంయమనం పాటించినా అలనాటి సమకాలీనమైన భావాలు, సాంఘిక పరిస్థితులు అతని కావ్యనిర్మాణంలో ప్రతిబింబించక మానవు. కీ.శే. సురవరం ప్రతాపరెడ్డిగారు మన ప్రాచీన కావ్య ప్రబంధాల్లో నూటికి తొంబది పాళ్ళు సాంఘిక చరిత్ర నిర్మాణానికి పనికిరావని అన్నప్పటికీ సహృదయులైన విమర్శకులు నన్నయ మహాభారతం, నన్నెచోడుని కుమార సంభవం వంటి తెలుగు కావ్యాల్లో ప్రతిఫలించిన తెలుగు సంస్కృతిని సాంఘిక స్థితిని వెలువరించారు. అట్లే మేఘసందేశం చక్కని రసవత్కావ్యమైనా అందు నాటి సమాజం స్పష్టంగా కనపడ్తూ ఉంది. మేఘదూతంలో కన్పిస్తున్న సామాజిక పరిస్థితులు కొన్ని అంతకంటె ప్రాచీన కాలంలో ఉండవచ్చు. మరి కొన్ని నేటివరకూ కన్పిస్తున్నవే కావచ్చు. అందలి సాంఘిక స్థితిగతులను గమనించినపుడు కొన్ని సందర్భాల్లో ప్రాచీనులపై ఎనలేని గౌరవభావం కలుగవచ్చు. కొన్ని సందర్భాల్లో ఇంత అమాయకులా అన్న భావమూ కలుగవచ్చు. ఏది ఏమైనా అందు ఆనాటి సంఘం కొంత భాగమైనా స్పష్టంగా కనిపిస్తున్నది.

**పురుషులు :-**

నాడు ధనికులు చేతులకు బంగారు కంకణాలు ధరించేవారు. సామాన్యులు వెండితో చేసిన కంకణాలను ధరించేవారేమో? యక్షుడు భార్యా వియోగం వల్ల "కనకవలయ భ్రంశ రిక్త ప్రకోష్ఠు"డైనాడు. (పూ. మే. 2శ్లో) స్త్రీలు గాజులు ధరిస్తున్నట్లు పురుషులు హస్తాభరణంగా వలయాలు (కంకణాలు) ధరిస్తున్నట్లు కన్పిస్తుంది.

**వీరులు :-**

యుద్ధంలో తమ ప్రాణాలకు తెగించి విజయమో వీరస్వర్గమో అన్నట్లు శత్రువులతో పోరాడేవారు. పోరాటంలో ఆయుధాలవల్ల గాయాలు తగిలితే అవి వారికి ఆభరణాలుగా భావించుకొనేవారు. తమ ఏకాంగ వీరతకు ప్రభువులు సంతోషించి ప్రసాదించిన డులు, మాన్యాలకన్నా మిన్నగా ఈ గాయపు గుర్తులనే చూపుకొనేవారు. ఉజ్జయినీ పట్టణ లోని వీరులు ఆభరణాల కాంతులకన్నా చంద్రహాసంవల్ల ఏర్పడ్డ వ్రణాంకములను గొప్పగా చూపుకొనేవారు. (పూ.మే. 35)

**స్త్రీలు :-**

ధనవంతులైన స్త్రీలు నాడు ప్రతిదినము తప్పక కాళ్ళకు పారాణి పూసుకొనేవారు. పారాణి పూసుకొని తడి ఆరకముందె మేడలపై తిరుగుతున్నందువల్ల సౌధోపరిభాగాలు "లలిత వనితా పాదరాగాంకితా" లయ్యేవి. (పూ. మే. 36) కాళ్ళకు గజ్జెలుండే నేటి పట్టా గొలుసుల వంటి ఆభరణాలు ధరించేవారు. అవి నడిచేటప్పుడు, నృత్యం చేసే సమయంలోను ఘల్లు ఘల్లుమని శబ్దిస్తూ ఉండేవి. (పూ. 39) నడుముకు బంగారు లేక వెండితో చేయబడ్డ మొలనూలు (కాంచీగుణం) ధరించేవారు. దానికి హంసలవంటి పక్షుల ఆకారం గల గజ్జెలుండేవి. అవి ఆ స్త్రీలు నడుస్తున్నా నృత్యం చేసినా మనోజ్ఞంగా ధ్వనించేవి. (పూ 29 ఉ 3)

చెవిలో పూవు పెట్టుకోవడం ఈ రోజుల్లో అమాయకత్వానికి చిహ్నం కాని ఆనాడు స్త్రీలు చెవిలో పూలు అలంకారంగా పెట్టుకొనేవారు. నాటి స్త్రీలు ఎక్కువగా కలువలను కర్ణాభరణంగా ధరించేవారు. (పూ. 27) మరికొందరు శిరీష పుష్పాన్ని ఉంచుకొనేవారు. (ఉత్తర 2) తల్లులు తమ మగపిల్లల చెవికి సైతం అలంకారంగా కలువ పువ్వులు పెట్టేవారు. భవాని కలువ పువ్వులు పెట్టే చెవిలో ప్రేమతో రాలిపడిన నెమలి ఈక పెడుతున్నదట.

"జ్యోతిర్లేఖావలయి గలితం యస్య బర్హం భవానీ
పుత్రప్రేమ్ణా కువలయదళప్రాపి కర్ణే కరోతి" (పూ-48)

ఆనాడు చిన్నపిల్లల విషయంలో అలంకరణ దగ్గర స్త్రీ పురుష భేదం అంతగా పాటించేవారు కాదు. ఈ అలవాటు నేటికీ మనకు కనిపిస్తుంది.

ఇక పూలపై ఎక్కువ మోజున్న స్త్రీలు ఆభరణాలకు బదులు చేతిలో, ముంగురులలో, పాపిటలో, కొప్పులో, చెవిలో రకరకాలైన పూలు పెట్టుకొనేవారు. చివరికి ముఖానికి లేత పసుపురంగు గల పుప్పొడిని పూసుకొనేవారు. అలకానగరిలో స్త్రీలు చేతిలో కమలం ముంగురులలో మల్లెమొగ్గలు, ముఖానికి "లొద్దిగ" పూ పరాగం, కొప్పులో కురవకము, చెవిలో శిరీష పుష్పం, పాపిటలో నీప పుష్పాలను ధరించేవారట.

"హస్తే లీలా కమలమలకే బాల కుందానువిద్ధం
నీతా లోధ్ర ప్రసవ రజసా పాండుతామాననే శ్రీః
చూడాపాశే నవ కురవకం చారు కర్ణే శిరీషం
సీమంతే చ త్వదుపగమజం యత్ర నీపం వధూనాం"
(ఉ - 2)

చేతులకు ధరించే కంకణాలతోపాటు బయటి భాగంలో ముళ్ళ వంటివి కల కంకణాలు ధరించేవారు. అవి ప్రక్కవారికి తగిలితే గుచ్చుకొని రక్తము స్రవించేది. ఇది ఒక విచిత్రమైన ఆభరణంగా కనిపిస్తుంది. (పూ. 65) మెడలో నల్లని ఇంద్రనీలమణి గల పెద్ద పెద్ద ముత్యాల హారాలను ధరించేవారు. తెల్లని ముత్యాల మధ్య ఇంద్రనీలం వింత శోభను కలిగించేది. (పూ. 50) నాటి స్త్రీలు పెదవులకు లత్తుక, కంటికి కాటుక తప్పక ధరించేవారు. అంజన స్నేహ శూన్యతను భర్తృ వియోగానికి చిహ్నంగా పరిగణించేవారు. (ఉ. 23, 34)

ఇప్పుడు ప్రతి ఇంటిలో కనిపిస్తున్నట్లు నీటి సౌకర్యముండేది కాదు. ధనవంతులు మాత్రం విశాలమైన తమ ఇళ్ళలో చెట్లకు, మరియు ఇతర ఉపయోగాలకు దిగుడుబావులు నిర్మించుకోగా సామాన్యులు దగ్గరగా ఉండే నదికి వెళ్ళి స్నానాదికృత్యాలు నిర్వర్తించుకొనేవారు. ఇంట్లో బావి తవ్వించుకొనే శక్తి లేనందువల్ల కాబోలు సుమతీ శతకకర్త "ఎప్పుడు ఎడతెగక పారు ఏరు" లేని ఊరు చొరవద్దని ఉపదేశించినాడు. స్త్రీలు కూడా నలుగురైదుగురు కలిసి పసుపు, చందనం మొదలైన విలేపన ద్రవ్యాలు తీసుకొని నదికి స్నానానికి వెళ్ళేవారు. బహుశః స్త్రీలు స్నానం చేయటానికి ప్రత్యేకంగా స్నాన ఘట్టాలుండేవి కాబోలు (పూ 37) ఇంట్లో దిగుడుబావి ఉంటే సామాన్య స్త్రీలు ఒకపక్క స్నానం చేసేవారేమో. ఇక ఇంటి యజమానులు స్నానం చేయుటకు ప్రత్యేకంగా స్నాన గృహాలుండేవి. ఈ స్నానగృహాల పైకి యంత్ర సహాయంతో నీరు చేర్చి గొట్టాల ద్వారా నీరు స్నానశాలలోకి వచ్చేటట్లు అది ధారలు ధారలుగా పడునట్లు ఏర్పాటు చేసుకొనేవారు. దానిని వారు "యంత్రధారాగృహం"గా పేర్కొనేవారు. ఈనాడు ధనవంతులు ఇళ్ళలో ఏర్పాటు చేసుకుంటున్న "వాటర్ షవర్"ను పోలియుండేవేమో. అనాటి యంత్రాలు కాని నీళ్ళు ధారలుగా పడుటకు ఏర్పాటు చేసుకున్న పద్ధతులు గాని వివరంగా మాత్రం తెలియవు. (పూ. 65).

స్నానం శుద్ధ స్నానం, అభ్యంగన స్నానం అని రెండు విధాలుగా కనిపిస్తుంది. శుద్ధస్నానం తలంటుకోకుండా నీటిలో నిండుగా మునిగి చేసేది కాగా అభ్యంగనం తలంటుకొని చేసే స్నానం. ఏ పద్ధతిలోనైనా ప్రతిరోజు స్త్రీలు సైతం తలవిండా స్నానం చేసేవారు. అభ్యంగన స్నానం చేసిన స్త్రీలు వెంట్రుకల తడి పోగొట్టుకొనుటకు సుగంధ ద్రవ్యాలతో ధూపం వేసుకొనేవారు. దానివల్ల వెంట్రుకల తడి ఆరిపోవడం మాత్రమే కాక వెంట్రుకలు సువాసనాభరితంగా కూడ ఉండేవి. (పూ. 36)

నాటి స్త్రీలు ఇళ్ళలో నెమిళ్ళను, చిలుకలను, గోరువంకలను కాలక్షేపానికి పెంచుకొనేవారు. (పూ 36, ఉ. 18, 24) కొన్ని ఇళ్ళలో పావురాలు కూడా ఉండేవి, నాటి స్త్రీలు పూల చెట్లను తమ చంటిపిల్లల్ని పెంచినంత ప్రేమతో అపురూపంగా జాగ్రత్తగా పెంచుకొనేవారు. (ఉ. 14) తమ బంధువులకు దగ్గరి వారికి సుఖ సంతోషాలను ఆరోగ్యాన్ని కాంక్షిస్తూ పూజలు చేసేవారు. (ఉ. 24) ఇంటికి వచ్చిన బంధువులకు యథాశక్తి ఉపాయనమిచ్చి పంపేవారు. (పూ-36).

సంగీతము :-

నాటి స్త్రీలు సంగీతంలో ఎక్కువ పరిశ్రమ చేసేవారు. స్వయంగా గేయరచన చేసి దానికి అనుకూలంగా సంగీతాన్ని సమకూర్చుకొని పాడే నేర్పు కూడా కొందరు స్త్రీలకుండేది. సంగీత సాధనాల్లో వీణ, మృదంగం ఎక్కువగా కన్పించేవి. (ఉ 25) తప్పెటను దేవాలయాల్లో అర్చనవేళ ఉపయోగించే వారు. (పూ. 38) ధనవంతులు స్త్రీలతో కలసి మధువు నాస్వాదించే సమయంలో చక్కని సంగీతం కల పాటలు పాడించుకొనేవారు. కమ్మని పాటలు వింటూ స్త్రీలతో కలసి మద్య మాస్వాదించుట నాగరికతకు చిహ్నంగా నాడు భావించేవారు. (ఉ. 10) వేణునాదం తోడు కాగా మృదంగాది వాద్యాలు మ్రోగుతుండగా పాటలు పాడుటను సమగ్రమైన సంగీతంగా నాడు భావించేవారు. (పూ. 60)

చిత్రములు :-

ధనవంతులు తమ ఇళ్ళలో అనేక విధాలైన చిత్రాలుంచుకొనేవారు. సహజంగా లభించే వివిధ వర్ణాలు గల గైరికాది ధాతువులను నీటిలో కలిపి చిత్రాలు వేయుటకు ఉపయోగించేవారు. అందువల్ల అవి నీరు పడితే చెడిపోయే ప్రమాదమున్నందువల్ల వర్షాదులవల్ల తడిసి చెడిపోకుండా వాటిని చాలా జాగ్రత్తగా రక్షించుకొనేవారు. చిత్రాలు వేయుటలో పురుషులతోపాటు స్త్రీలు కూడా కృతహస్తలై ఉండేవారు. (ఉ 9, 24, 44)

ఆటలు :-

గూఢమణి ఒక దేశీయ క్రీడ. దీన్ని స్త్రీలు పురుషులు కలిసి, లేక విడివిడిగా ఆడుకొనేవారు. నదీతీరాల్లో సముద్రతీరాల్లో విహారానికి వెళ్ళిన యువతీ యువకులు ఇసకలో కూర్చొని ఒక చోట రహస్యంగా మణిని దాచి రెండవవారిని కనుగొనమని చెప్పేవారు. (ఉ. 6) ఈ ఆటను ఇప్పటికీ పల్లెటూళ్ళలో పల్లెతో ఆడ్తారు.

దేవాలయాలు :-

ఉజ్జయినిలో నాడు మహాకాళనాథుని ఆలయముండేది. ఆలయాల్లో త్రిసంధ్యల్లో పూజలు జరిగేవి. శివునికి ప్రదోషపూజ పరమ ముఖ్యమైంది కావున సాయంకాల పూజ పటహాది వాద్య ఘోషలతో జరిగేది. సాయం పూజా సమనంతరం వేశ్యలు నృత్యం చేసేవారు. ఈ రంగభోగాంగంగా వేశ్యలు చామర సేవాద్యుపచారాలు చేసేవారు. (పూ. 39) భగవంతునికి తాము నేర్చిన నృత్యాది విద్యల ద్వారా దాస్యం చేస్తూ కాలం గడుపుతున్నందువల్ల తరువాతి కాలంలో వీరిని దేవదాసీలుగా పరిగణించారు. స్థలీ దేవతలనే ప్రత్యేక పరిగణన నాడు కన్పిస్తుంది. (ఉ. 45) ఆయా స్థలాల్లో ప్రత్యేకంగా కన్పించిన దేవతలను స్థలీ దేవతలుగా పేర్కొంటున్నట్లు తెలుస్తుంది.

ఇళ్ళు :-

మేఘదూతంలో కన్పించే యక్షుని గృహవర్ణన ఆనాటి ధనికుల గృహాలను చూచి చేసినదై ఉండాలి. ఆనాటి ధనికుల గృహాలు అత్యున్నతమైన మేడలతో కూడి ఉండేవి. ఇంటిలో అనేక విధాలైన చిత్రాలు చిత్రించుకొనేవారు. నేల నున్నగా గచ్చు చేయబడి మణులు పరచినట్లు మెరుస్తూ కన్పించేది. మేడల పై భాగం కూడ గచ్చు చేయబడి నునుపుగా కన్పించేది. అందువల్ల సాయంకాలంనుండి ఇంచుమించు తెల్లవారు వరకు మేడల పైభాగాన మృదంగాది వాద్యాలు మ్రోగుతుండగా సంగీతం వింటూ తమ స్త్రీలతో కలసి మధువు సేవిస్తూ సరస సల్లాపాలతో కాలక్షేపం చేసేవారు. ఆ తర్వాత తెల్లని వితానాల (చాందినీ) కింద సుఖసుప్తులయ్యేవారు. (ఉ. 5, 8)

ఇంటిముందు రెండువైపులా లక్ష్మీచిహ్నంగా అందమైన శంఖ పద్మముల చిహ్నాలుంచుకొనేవారు. అట్లే ద్వారానికి రెండు వైపులా చిన్న పూలచెట్లు పెంచుకొనేవారు. విశాలమైన ఖాళీ స్థలం ఇంటి చుట్టుముట్టు ఉండేది. అందువల్ల స్త్రీలు విహారార్థమైనా ఇల్లు వదలి వెళ్ళాల్సిన అవసరముండేది కాదు. పైగా ఇంటి స్థలంలో ఒకవైపు చిన్న చిన్న నల్లని గుండ్లను పేర్చి విహారార్థం కృత్రిమ శైలాన్ని నిర్మించేవారు. కృత్రిమమైన ఆ క్రీడా శైలం పైన చిన్న చిన్న గుబురైన వృక్షాలు పెంచుకొనేవారు. లతలతో విశ్రాంతి తీసుకొనుట కనువుగా మండపాలు నిర్మించుకునేవారు క్రింద ఆ కృత్రిమ శైలం చుట్టూ అరటి మొదలైన చిన్న చిన్న చెట్లతో కంచె వేసుకునేవారు. ఇంట్లో ఉన్న దిగుడుబావికి శిలా సోపానాలు నిర్మించి తేలికగా బావిలోకి దిగి నీరు తీసుకునే ఏర్పాట్లు చేసుకొనేవారు. ఇవి ఆనాటి మహా ధనికులు లేక రాజుల ఇళ్ళలో కన్పించే దృశ్యాలు.

(ఉ. 1, 16, 17, 19 శ్లోకాలు)

**ఉద్యానవనాలు :-**

నాడు ప్రతి పట్టణంలో తప్పక ఉద్యానవనాలుండేవి. కాని ఇవి పట్టణ మధ్యభాగంలో కాక పట్టణం వెలుపల ఉండేవి. అందు వల్ల నగరవాసులు సాయంకాలం విహారార్థం పట్టణం వెలుపల నున్న ఉద్యానవనాలకు వెళ్ళి వచ్చేవారు. ఈ ఉద్యానవనాల్లోకి రాకపోకలకు అనువుగా త్రోవలుండేవి. మిగిలిన భాగమంతా మొగిలి చెట్లతో కంచె వేసేవారు. అందువల్ల పశువులు యధేచ్ఛగా తిరిగి ఉద్యానవనాలను పాడుచేసేవి కావు. పైగా మొగలిపూలతో ఆ ఉద్యానాలు సువాసనాభరితాలయ్యేవి. (పూ. 24) సాయంకాల మయ్యేసరికి పట్టణవాసులు తమ ప్రియురాం(డ్ర)తో కలిసి ఆ బాహ్యోద్యానవనంలో మధువు సేవిస్తూ సరస సల్లాపాలతో కాలం గడిపేవారు. (ఉ. 10)

**పల్లెలు :-**

అమాయక ప్రజలకివి ఆటపట్టు. వ్యవసాయమే వారి ప్రధానవృత్తి. అందువల్ల మబ్బు పట్టిందంటే వారికి పండుగ. ఎక్కువగా నాటి వ్యవసాయం దేవమాతృక. అందువల్లే మబ్బులను ఆదరంతో చూచేవారు.

గ్రామంలో ఉండే వృద్ధులు తమ గ్రామానికి చుట్టపు చూపుగా వచ్చినవారికి ఆయా ప్రాంతపు విశేషాలను కథలు కథలుగా చెప్పేవారు. ఈ అలవాటు పట్నవాసులకు కూడా ఉండేది. ఉజ్జయినిని చూడవచ్చేవారికి అచ్చటి వృద్ధులు ప్రద్యోతనుని కథలను ఆయా ప్రాంతాలు చూపుతూ వివరించే వారు. (పూ. 31, 34)

సమస్యలు తగవులు రచ్చబండ దగ్గర పరిష్కార మయ్యేవి. రచ్చబండ ఒక పెద్ద చెట్టుకింద ఉండేది కావున నాడు దాన్ని రచ్చబండగా కాక రథ్యావృక్షంగా వ్యవహరించేవారు.

**పథిక వనితలు :-**

ఆనాడు ఎక్కువగా వీరి వర్ణన కన్పిస్తుంది. పల్లెల్లో వ్యవసాయం వల్ల కుటుంబానికంతా గడిచేది కాదు. వయసు మీరిన వారు, మిక్కిలి వృద్ధులు, స్త్రీలు, బాలురు ఎక్కడికీ వెళ్ళలేక గ్రామాల నాశ్రయించుకొని ఉంటే యువకులు, నడివయసులో ఉన్నవారు వర్షాకాలం గడచిన తరువాత గ్రామాలు పట్టణాలు తిరుగుతూ వాణిజ్యం, కాయకష్టం మొదలైనవాటిద్వారా డబ్బు సంపాదించి వర్షాకాలంలో ఎచ్చటికీ తిరుగుటకు వీలులేక సంపాదించిన డబ్బుతో భార్యాపిల్లలను చూచుటకు ఇల్లు చేరుకొనే వారు. పథిక వనితలు వర్షాకాలం సమీపిస్తున్నదంటే తమ ప్రియులు ఇంటికి తిరిగి వస్తారన్న ఆశతో ఎదురు చూస్తు౦డేవారు.

**వావి వరుసలు :-**

కొత్త పురుషుడు తన భార్య దగ్గరకు తన యోగ క్షేమాదులు తెల్పుతూ సందేశముంచు వరుసపెట్టి పంపేవారు. వయస్సులో ఇంచుమించు సమానంగా ఉండే స్త్రీలను అక్క లేక వదిన అని వరుసపెట్టి పిలిచేవారు. అక్క, వదిన ఇద్దరూ మాతృ సమానులే ఐనా అక్క దగ్గర చూపు చనువు వదిన దగ్గర చూప లేము. పైగా ఆమె అన్నివిధాలా గౌరవనీయ స్థానంలో ఆమెను భ్రాతృజాయగా (వదిన) అతనిని తనకు తమ్ముడుగా వరుసలు కలిపేవారు. అన్న మాటను తమ్ముడు జవదాటుట భారతీయ సంప్రదాయ విరుద్ధం కదా. ఆ విధంగా తమ పనులు పూర్తి చేసుకునేవారు. (పూ. 10)

**శకునాలు :-**

ప్రయాణాదుల్లో శకునాలు చూచే అలవాటు నాటికే ఉన్నది. కొన్ని శకునాలవల్ల ప్రయాణం సుఖంగా సాగుతుందని అనుకునేవారు. ఇంటినుండి బయలుదేరే ముందు చల్లని మంద మారుతం వీస్తే, చాతకపక్షి ఎడమవైపునుండి అరిస్తే, బలాక పంక్తి ఆకాశాన కన్పిస్తే కార్యసిద్ధి తప్పక జరుగుతుందని విశ్వ సించేవారు. ఎడమ కన్ను, ఎడమ భాగం స్త్రీలకు అదిరితే దాన్ని శుభ శకునంగా భావించేవారు. (పూ. 9 ఉ. 34, 35)

**శరభ మృగాలు :-**

ఇవి హిమాలయ పర్వత సానువుల్లో కన్పించే వింత మృగాలు. ఇవి ఏనుగులను ఎగిరి చంపగలిగిన బలిష్ఠమైన జంతువులు (పూ. 58) ఎనిమిది కాళ్ళు గల జంతువుగా "శలభః శరభే చాష్టపదే ప్రోక్తో మృగాంతరే" అని విశ్వమనే నిఘంటువు వివరిస్తున్నది. సింహంకంటె బలిష్ఠమైన జంతువుగా పురాణాలు వివరిస్తున్నాయి. మనకు ఆక్టోపస్ అనే ఎనిమిది కాళ్ళ జంతువు ఉన్నట్లు తెలిసినా అది నీటిలో మాత్రం నివసించేదని తెలుసు. కాని శరభ మృగం భూమిపై విహరించే జంతువుగా ఇచ్చటా, భారతంలో, ఇతర పురాణాల్లో వర్ణించబడింది. అందువల్లనే మన నిఘంటువుల్లోకి కూడా ఈ పదం ప్రవేశించింది. కాని

ఇంకా శాస్త్రజ్ఞులు దీన్నిగూర్చి వివరంగా తెలుపలేకున్నారు. అదృష్టవశాత్తు హిమాలయాల్లో దీని అవశేషాలు దొరికితే తప్ప దీని వివరణ మనకు లభించదు. అంతవరకు ఇది ఒకనాడు భూమిపై ఉండిన బలిష్ఠమైన మృగంగా భావించుకొని తృప్తి పడవలసిందే!

ఇక ఈ కావ్యంలో స్త్రీలు అమాయికలు, విరహరాస్యలు ఉన్నట్లు కన్పిస్తుంది. యక్షుని భార్య చిత్రలేఖనంలో, సంగీతంలో, గేయ రచనలో నేర్పరి అని చెప్పబడినా ఆమె భర్త వియోగానంతరం గడచిన మాసాలను "దేహళీదత్త పుష్పై"లతో లెక్కించేది. (ఉ. 26) అంటే గడపపైన ప్రతిరోజు ఒక పువ్వు చొప్పున పెట్టి తెల్లవారి వాడిపోయిన ఆ పూవును ప్రత్యేకంగా ఒక మూలకు పెట్టి కుప్పగా ఏర్పడ్డ వాటిని ఒకనాడు లెక్క పెడ్తూ గడచిన మాసాలను లెక్కపెట్టేది. ఇది ఒకవిధంగా నాటి స్త్రీలు సంగీత సాహిత్యాల్లో ప్రావీణ్యం గడించినా అక్షరజ్ఞాన శూన్యలనే భావాన్ని కల్గిస్తున్నది. కాని ఆనాటి ఇతర సాహిత్యాన్ని ముఖ్యంగా కాళిదాసు నాటకాలనే చదివితే శకుంతల, మాళవికలు లేఖలు రాసినట్లు తెలుస్తున్నది.

ఈ విధంగా మేఘదూతం పరిమాణంలో చాలా చిన్న కావ్యమైనా విమర్శకులకు కాళిదాస మహాకవి సమకాలీన సంఘాన్ని కొంతైనా చూపిస్తున్నది. నాడు సుఖ సంపదలు సమృద్ధిగా ఉండి కొన్ని విషయాల్లో వైజ్ఞానికంగా, నాగరికంగా అభివృద్ధి చెందిన ఆధునిక కాలానికి దీటు రాగల నాగరిక సమాజం, ముగ్ధ మోహనమైన పల్లె వాతావరణం స్పష్టంగా కన్పిస్తూ ఉంది.

# భయము

దేవుడంటే నాకేమి భయము?
గావు కేకలంటేనే భయము.

దయ్యమంటే నాకేమి భయము?
దురాచారమంటేనే భయము.

మనిషి అంటే నాకేమి భయము?
అమానుషమంటేనే భయము.

రాక్షసులంటే నాకేమి భయము?
నేటి కిరాతకులంటేనే భయము.

అజ్ఞానులన్న నాకేమి భయము?
సంఘ రాబందులంటేనే భయము.

ద్రోహులంటే నాకేమి భయము?
సంఘ విద్రోహులంటేనే భయము.

మతము అంటే నాకేమి భయము?
మతోన్మాదమంటేనే భయము.

శత్రువంటే నాకేమి భయము?
కపట మిత్రులంటేనే భయము.

లోభమంటే నాకేమి భయము?
ప్రలోభపరులంటేనే భయము.

రోగము అంటే నాకేమి భయము?
అధికార రోగమంటేనే భయము.

క్రోధమంటే నాకేమి భయము?
విరోధమంటే ఎంతో భయము.

దురితమంటే నాకేమి భయము?
దుఃఖమంటేనే ఎంతో భయము.

చీకటి అంటే నాకేమి భయము?
అజ్ఞాన తిమిరమంటేనే భయము.

కోరికలంటే నాకేమి భయము?
గొంతెమ్మ కోర్కెలంటేనే భయము.

రాజులంటే నాకేమి భయము?
రాజకీయాలంటేనే భయము.

అన్యాయమంటే నాకేమి భయము?
న్యాయాపహరణమంటేనే భయము.

అస్థిరతంటే నాకేమి భయము?
సుఖరహిత ప్రాణమంటేనే భయము.

మృత్యువు అంటే నాకేమి భయము?
అవిధేయ భృత్యులంటేనే భయము.

శ్రీ దేవరకొండ సుబ్రహ్మణ్యశాస్త్రి

# ధృతరాష్ట్ర కౌగిలి

## శ్రీ ఆచాళ్ల శ్రీనివాసరావు

ఈ కార్తీకపు ఓ ప్రత్యూషం వేళ.... అలసిన శశి అస్తమయ కాంతిలో నిద్ర లేచిన పిట్టల ప్రపంచాన్ని నిద్ర లేపేందుకు సుప్రభాతాన్ని వినిపిస్తున్న వేళ.... కళ్ళు తెరిచి, గది కిటికీ గుండా చూపు సారిస్తే.... ఆశల ఆకాశంలో ఎక్కడో ఓ ఒంటరి నక్షత్రం - కదిలే కొబ్బరాకు చాటుగా కదలాడే చందమామ. అప్పుడే రేకు విరుస్తున్న బాల గులాబిపై కురిసే తెలి వెన్నెల, తొలి మంచు, హిమస్నాత పునీత పుష్పమై, తెల్ల గులాబీ పరువంపు ప్రాయంలో కనుల వాకిట దిద్దుకున్న ఏ కలల రంగవల్లికలనో పరికిణీ కుచ్చిళ్ళు సర్దుకుంటూ, యింటి ముంగిట ముగ్గులుగా దిద్దుతున్న ఎదురింటి పదహారణాల తెలుగమ్మాయి - యివే ఈ ఉదయం నాకు కళ్ళు తెరిస్తే కనిపించిన దృశ్యాలు.

తెల్లారి లేవగానే బిందెడు నీళ్ళ కోసం మున్సిపాలిటీ కుళాయి దగ్గర భగీరథ తపస్సు చేయనవసరం లేకుంటే, పావు లీటరు పాల పేకట్టు కోసం క్షీరసాగర మథనమంత యాతన పడే అవసరమే లేకపోతే ప్రతి ఉదయం యింత సుందరంగానూ, సుమధురంగానూ తెల్లవారుతుంది నాకు.

రేయి స్వప్నాల జ్ఞాపకాల నీడలింకా తొలగిపోక అనుకుంటా నా పెదవులపై చిరునవ్వు. నాలుగేళ్ళ క్రితం యిరవై ఏళ్ళ వయసులో గుండెలోతుల రేకు విచ్చిన మమతల మల్లెలు-

నల్లని నీ కురులు నాకు నిద్ర ముసుగు కప్పాలి,
నవ్వే నీ కనులు నాకు శుభోదయం పలకాలి.

అంటే చిరునవ్వు, ఆ చిరునవ్వుకి అర్థం - కులాల ఎల్లల మధ్య సంసారపు గోడలు లేచి భాగాలుగా విడిపోయిన ప్రపంచంలో మన నేస్తం ఎలా కొనసాగుతుందనే ప్రశ్న అని చెప్పకుండానే దూరమయిన 'నేస్తం' గుర్తుకొచ్చి కనుకొనలలో కదలాడిన నీటి బిందువు. హృదంతరాళంలో ఎక్కడో ఏ మూలో నిద్రలేచిన మాస్క్యులేనిటీ, మేల్ ఈగో.... వెంటనే ఆ ఒంటరి కన్నీటి బిందువుని తుడిచిపారేసేంతలో....

....మోపెడ్ శబ్దం వినిపించింది. వెన్వెంటనే అది వీధి గుమ్మం ముందు ఆగడం, నేను తలుపు తీసుకుని వీధిలోకి వెళ్ళడం జరిగాయి. సత్యమూర్తి మోపెడ్ యింజన్ ఆపకుండానే "శంకర్రావ్ ఏదో హడావుడి చేసాడు. త్వరగా బయల్దేరు." అన్నాడు. త్వరగా బయల్దేరేసాను. అయినా పర్సు జేబులో పెట్టుకోవడం మరచిపోలేదు. అసలు మరి కీట్స్ భావుకత్వం కంటే, కీన్స్ ఆర్థిక తత్వానికి ఎక్కువ ప్రాధాన్యత యివ్వాల్సి రావడం కేవలం నా తప్పు కాదు. దారిలో చెప్పాడు సత్యమూర్తి- శంకర్రావ్ ఉరి పోసుకున్నాడనీ, ప్రాణం పోయిందనీను.

సత్యమూర్తి రాకమునుపు రాబోయిన కన్నీటిబొట్లు.... కనుకొలకుల నుంచి రాలిందనుకున్నాను. ఊహూ, వాస్తవాన్ని జీర్ణించుకోలేని మనసు కట్రోటే అయి జారే కన్నీటి చుక్కని వేదనల వేడి సెగ ఆవిరిగా మార్చేసిందనుకుంటా; ఓ వేడి నిట్టూర్పు మాత్రం బయటకు వచ్చింది.

చనిపోయిన శంకర్రావ్ స్వంత ఊరు మా ఊరికి ఆరు కిలోమీటర్ల దూరంలో వున్న ఓ చిన్న పల్లె. అయితే మా ఊరి వేంకట రమణమూర్తి గుడిలో కేశ ఖండనాల నుండి పిల్లల చదువుల కోసం కాన్వెంట్ల వరకూ (రెండింటికీ చేసే ప్రక్రియలో పోలికలు కనిపిస్తాయి నాకు) అన్నీ అందుబాటులో వుంటాయని, కాపరం మాత్రం మా వూళ్ళో పెట్టాడు శంకర్రావ్. శంకర్రావ్ సత్యమూర్తికి దూరపు చుట్టమూ, నాకు దగ్గరి మిత్రుడూను. పల్లెలో అయిదెకరాల పొలం, మా ఊరి మిల్లులో నెలకి అయిదు వందల రూపాయల గుమస్తాగిరీ - మూడు గదుల యిల్లూ, ముత్యాల్లాంటి ముగ్గురు పిల్లలూ, యిల్లాలూ శంకర్రావ్ స్వంతం.

యివేకాక, ఎప్పుడో టీనేజ్‌లో పరిచయం అయి, వయసుతోపాటూ, శంకర్రావ్ దినచర్యలో భాగంగా పెనవేసుకుపోయిన జూదమూ, తాగుడూ, యింకా వ్రాయడానికీ, చెప్పడానికీ ఈ సభ్య ప్రపంచం అంగీకరించని సర్వ సప్త వ్యసనాలూ శంకర్రావ్ (తనవీ అని ప్రకటించుకోకపోయినా) స్వంత ఆస్తులు.

నిత్యం శంకర్రావ్‌కి అప్పిచ్చే కాబూలీవాలా నుండి, అప్పుడప్పుడు అతన్ని వశాయించే కట్టుకున్నదాని వరకూ శంకర్రావ్‌ని 'చెడ్డ' అని మాత్రం అనలేరు. శంకర్రావ్ భార్య అతని హసనానికి రాణి అవునో కాదో కానీ అతడు మాత్రం నిశ్చయంగా వ్యసనాలకి దాసే.

మధ్యతరగతి కుటుంబీకుల జీవితాల్లాంటి రోడ్డుపై మోపెడ్ ప్రయాణిస్తోంది. మోపెడ్‌పై వున్న మా యిద్దరిలోనూ స్నేహితుడిని కోల్పోయామనే వ్యధ మాటలని కన్నీటిగా మార్చి మౌనాన్ని కోటగా పేర్చింది. మోపెడ్ గమ్యం చేరింది.

గుండె పగిలే వ్యధ గొంతు దాటి—

ఓర్నాయనోయ్! నా తాళి మాయదారి దేముడెత్తుకుపోయాడ్రోయ్ - నాదింక దొంగమొహం అయిపోయింది నాయనోయ్.... అనే మాటలుగా మా చెవుల పడింది. ఆ వ్యధా శకలాలు శంకర్రావ్ భార్య పగిలిన గుండెలవని అర్థం చేసుకోవటానికి పాఠకుడు ఈ రచయిత కానవసరంలేదు.

శవం చుట్టూ వార్త విని చేరుకుంటున్న చుట్టాలూ, స్నేహితులూ- తమ (అప్పు) సంగతేం చేసాడో తెలుసుకోవాలనే ఆతృత (పైకి వెళ్ళగక్కకపోయినా)తో అప్పులవాళ్ళూ, పేకాట ఫ్రెండ్స్, పార్టీ మిత్రులు (రాజకీయం కూడా వ్యసనాలలో ఒకటి కదా!) ఒక్కొక్కరూ ఒక్కోలా.... "దిక్కుమాలిన అప్పులు తీరకపోతాయా...." నుండి, "పాపం బిడ్డలు దిక్కులేనివాళ్ళయి పోయారు..." వరకూ నిట్టూర్పుల వడగాడ్పులు విసురుతుంటే....నేమో, సత్యమూర్తి మిగతా తంతు జరిపించే ప్రయత్నంలో వద్దాం. నాకెందుకో శ్రీశ్రీ గుర్తుకొచ్చారు. "అటు చూస్తే అప్పులవాళ్ళూ, యిటు చూస్తే బిడ్డల ఆకలి, ఉరిపోసుకు చనిపోవడమో, సముద్రములో పడిపోవడమో...."

శంకర్రావ్ చావు 'అతని' సమస్యలని తీర్చివుండవచ్చు. కానీ, యింకా ముప్పయోపడి దాటని భార్య, పదమూడేళ్ళ కూతురూ, పండగకి మొదటిసారిగా ఫుల్‌పేంట్ తొడుక్కోవాలని సంబరపడే యిద్దరు కొడుకులూ....అంతేనా!

కొడుకు చితికి నిప్పంటించవలసి వచ్చిన తండ్రి, కోడలి బొట్టు చెరిపేయవలసివచ్చిన తల్లి - గుండెలపై పడి రోదిస్తూ గుండెలలో తలదాచుకోవల్సిన చెల్లి—

ఎవరు వీరి వేదనల వెనక కారకులు? విధా? కాలమా?? శంకర్రావ్‌లోని ఎస్కేపిజమా!? జూదం నుంచీ మద్యం మీదుగా రేసుల వరకూ దేనినీ పూర్తిగా బ్యాన్ చేయలేని ప్రభుత్వ అవకాశవాద విధానాలా??? తెలిసీ తెలియని వయసులో, ఫలితాలు తెలియని వ్యసనాల ధృతరాష్ట్ర కౌగిలికి బలయిపోయి, చివరికి బలవన్మరణపు బలిపీఠానికి జీవితాన్నప్పచెప్పి సత్యప్రపంచపు సత్యత్వం కోల్పోయిన శంకర్రావ్ బలహీనతా?? ఏమిటి కారణం???

కారణం తెలియలేదు కానీ శంకర్రావ్ అంత్యక్రియల తర్వాత యింటికొచ్చేసరికి మరో పదిహేనేళ్ళ కుర్రాడు చేతిలో పేకముక్కలు సర్దుకుంటూ!....

# కాలచక్రం

## శ్రీ ఏ. సూర్యప్రకాశ్

రాత్రి కాళ్ళక్రింద పగటి కాళ్ళక్రింద పడి
జీవితం నలిగిపోయింది
కాలం ఒక నియంతలా నడచిపోయింది
జీవితపు ఇసుక తిన్నెలపై!

అది ఏ బాధా తట్టిలేపని నిద్ర
చనిపోయిన మనుషులు ఎక్కడ కలుస్తారు
బ్రతికివున్న మనుషుల
పెదవుల మీద నాలుకల మీద

కీర్తి అనే ఆహారాన్ని తింటారు మరణించినవారు
మనం కూడా రాలిపోతాము
చెట్లనుండి కాయలు రాలిపడినట్లు
భావిలో కూడా ఈ గాలే వీస్తుంది
మన మునిమనుమలు కూడా దీనినే పిలుస్తారు!

# "ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది?"

"పోయిందే!"

మేలుపరచబడిన అమృతాంజన్ వాడడంతో

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు

మృదువైన అమృతాంజన్‌తో చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు

తలనొప్పులను పొట్ట నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే అతి త్వరితంగా ఉపశమింపజేయగలదు।




## మేలుపరచబడిన
# అమృతాంజన్



Amrutanjan Limited

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా. తిరిగి వికసింపజేయగలదు!

# ఆంధ్ర శృంగార తిలకము

## శ్రీ లలితకవి అల్లంరాజు లక్ష్మీపతి

మ॥ ఉరుబాహా బిసముల్, ముఖాంబుజము, రాకోత్కృష్ట నీరం బురో
జరథాంగంబులు, దృగ్ఝషంబు, కబరీ శైవాలమున్, శ్రోణి భా
సుర తీర్థాళ్ళములుంచి, ధాత రమణీ కుంభత్సర స్సీమ వే
ర్పఱచెన్ మార శరాగ్నితప్తులగువారల్ స్నానమున్ జేయఁగన్ ౧

ఉ॥ ఆమనిరేయి గ్రాలె, విభుఁడా యరుదేరఁడు నాదుమన్కి యిం
కేమిటి కగ్గిమ్రగ్గి గ్రహియింపఁ బునర్జవి, తూలికంటి మం
పై మెఱుఁ గార్చెదన్, బికము వ్యాధుఁడనై వలఁ బట్టెదన్ సుధా
ధాముని రాహువై యడఁచెదన్ విధు మాయుఁడనై కలంచెదన్ ౨

ఆ॥వె॥ చిగురుచేత, మల్లెచేత, సంపెంగ చేతఁ
దమ్మిచేత నుత్పలమ్ము చేత
మోవి, పన్ను, మేను, మోము, గన్, విధి చేసి
రమణి! మనసు నెట్లు రాతఁ జేసె? ౩

తే॥గీ॥ నళినదళమందు నొక ఖంజనంబు దోఁప
నలవడునుఁ జతురంగ బలాధిపత్య,
మక్షి ఖంజనయుగి నీ ముఖాబ్జమందుఁ
గలిగి యింకేమి కూర్చునో తెలియఁజాల ౪

చ॥ కమలమునందు ఖంజనమొకండు కనుంగొనినంత దైవ యో
గమునఁ గవుల్, ప్రసిద్ధిగలక్ష్మపతులౌదు రయ్యు గాదె? ముగ్ధ! త్వ
ద్విమల ముఖాబ్జమందదియు దృగ్వర ఖంజనయుగ్మమెంచి లో
కము మదనాస్త్ర సంహతి వికావికలౌందు నిదేమి చిత్రమో! ౫

చ॥ అతివ! సుధామయూఖ గ్రహణావసరంబు సమీపమయ్యె, నీ
గతి బయటన్ జరింపకుము! గ్రక్కున లోనికిఁ బొమ్ము! పోవిచో
గౌతుకక పూర్ణచంద్రు దెసకున్ జనకుండఁగ రాహువింక నీ
వితత కళావిలాస పరివృద్ధ ముఖేందువి మ్రింగఁ బొంగుచున్ ౬

ఉ॥ పోదు గదా! కపోలములఁ బూసిన కస్తురి, గంధచర్చ వో
లేదు గదా! చనుంగవఁ! జలించు కనుంగవఁ గజ్జలాప్తియున్
బోదు గదా! ప్రవాళములఁ బోలిన మోవుల పీటికాభ వో
లేదు గదా! యిటుందువు చెలీ! వి మనోధవుఁ, దర్గియుంటివో? ౭

చ॥ ఎటులనో వచ్చె నాత్మవిభుఁ డిన్ని దినంబుల, కా విదేశ వ
ర్యటన కథాప్రసంగముల రాత్రి సగంబు గతించె, నాకు నం
తటఁ బొలయల్కవానిపయిఁ దార్కొనె హెచ్చుగ, నంతలోనె ప్ర
స్ఫుట దరుణాకృతిన్ సవతివోలె కనంబడెఁ బ్రాచి నెచ్చెలీ! ౮

ఉ॥ నీరస కాష్ఠతాడనలు నీకయి శ్లాఘ్యము, శ్లాఘ్యమాతప
స్ఫారమహార్తి, పంకచయ సంగతి శ్లాఘ్యము, శ్లాఘ్యమా మహా
దారుణ వీతిహోత్రయుతి - తద్రమణీ కుచ పార్శ్వ బాహు వ
ల్లీరతి గల్గుటన్: సుఖము లేదు వ్యథాప్తి వినా ఘటోత్తమా! ౯

చ॥ దొరకొని మోము ముద్దుగొనెదో బలిమిన్, ప్రపలేచె నీ కిఁకన్
దొఱఁగు! తొలంగు! పైఁట, శఠ! దుశ్శపథోక్తులచేతఁ జేఁతలా
జరగుట? రాత్రి జాగర వశంబున దప్పితిఁ, జేరఁ బొమ్ము! నీ
తరుణిని, వాడియున్న సుమదామము లేటికిఁ దేటి కోటికిన్ ౧౦

చ॥ పనివిని వర్తకంబునయి పల్లభుఁ, డాతని నుండి వార్తయిం
దమకను లేదు, తజ్జనని వందనకోసము కాన్పుహోయ న
ల్లుని గృహమేఁగె, వేఁగునఁ, దళుక్కుల కాలనవోర్తఁ, బాంధ! యే
మని వినుందు విందు, నెటకైనను బొ, మ్మిదె సంజ యయ్యెడిన్ ౧౧

ఉ॥ భీమతమో నిబద్ధమయి విస్తృత నీరద పంక్తియుక్తమై
యామిని నిండియుండె, శ్రమమంది గృహస్థుఁడు పండియుండె, నీ
గ్రామములోనఁ జోరనికరంబుల భీతియు మెండు నిండె, న
న్నా! మనసీజభీతి వణకాడుదు, నిద్రను వీడు! పాంథుడా! ౧౨

క॥ చూపులు తూపులు చాపము
లాపైఁగల కన్నుబొమ్మ, లాఖేటకు రా
లీ పడుచు; దీని దాపున
బాపురె! నా మనసులేఁడి పరికింపంగన్ ౧౩

ఉ॥ ఆవిలబుద్ధిఁ బోదువెటు? వ్యాధి నివృత్తికి? వెజ్జుసింటికా?
ప్రావృత జాడ్య వర్గమణఁ పంగల నీ చెలి లేదె యింటిలో?
మోవిని గ్రోలినన్, జనుల మోదిన, దంతుల దేలినన్ వెసన్
బోవును శైత్య వాత కఫముల్, వృథగా శ్రమమొందె దెందుకో! ౧౪

తే॥గీ॥ బాల! కమలాయతాక్షి నాపైకి మరల
నీ యొయారంపు జూపు రానీయవలయు
విషమునకు మందు విషమంచు వినవె తొల్లిఁ
బెద్దలాడిన మేలైన ముద్దు సుద్దు? ౧౫

ఆ॥వె॥ కంతువహ్నికీల లంతర్గతంబులై
యేఁచ గంధచర్చలేల యిచట?
కుంభకార పవన గుంఫిత పంకముల్
కాఁకఁ బెన్చుఁ, గాఁకపోఁక మాన్చు. ౧౬

ఉ॥ పావన కృష్ణ సారములు బంధుర సుందర వంగవార కాం
తావళి నేత్ర సౌష్ఠవము నారసి దేశము బాసె, మత్తదం
తావళముల్ స్తనద్వయ జితంబులు నయ్యెను నయ్యెడన్ విడం
బోవు; ఖలుం దవజ్ఞఁ గనఁబోఁ దభిమానము ప్రాయికంబుగన్ ౧౭

క॥ కనుపించు నపూర్వంబగు
ననలము కామినుల చన్నులం దది దూరం
బున నున్న మేను గాల్చును
జెనకింపఁగ హృదయసీమ శీతలమిచ్చున్ ౧౮

క॥ సుందరి! నీ చనుగవ యీ
చందంబున జారెనేల? - జ్ఞాన విహీనా!
క్రందుకొని క్రిందఁ ద్రవ్విన
గ్రిందం బడుచుంటలేదె గిరిరాజంబుల్? ౧౯

ఆ॥వె॥ పూవులోన బూవు పుట్టుటెందును గూడఁ
జూడలేదు విన్న జాడలేదు
బాల! నీదు వదన పద్మంబు నందెట్లు
కల్గెనొక్కొ నల్ల కల్వ జంట! ౨౦

ఆ॥వె॥ మార చూతమంజు మంజరీ! ప్రేయసీ!
శ్రుతి విశాలరాగ సుందరాక్షి!
అపహరించి చిత్తమరిగె వెచ్చోటికి?
నీ యరాజకం బిఁకెందు గలదు? ౨౧

ఉ॥ కోపము నొందితే? సరియె, కోపమె తాపము మాపుచో, నదే
దీపిలఁ జేసికొమ్ము సుదతీ! యది యెందుకు నాకు? మున్ను నీ
కై పలుగంటు లిచ్చితివి, గౌగిట లిచ్చితి, ముద్దులిచ్చితిన్
దాపక నీవు నాకవి ఋణం పడియుంటివి, యిమ్ము! క్రమ్మఱన్ ౨౨

(మహాకవి కాళిదాస కృత సంస్కృత శృంగార తిలకమున కాంధ్రానుకృతి సంపూర్ణము)

శ్రీ "ధూళిపాళ మణిశ్రీ"

# అక్షర సమామ్నాయము : ఆంధ్ర లిపి

అభిప్రాయ ప్రకటనకు సంకేత సాధనాలు రెండు. 1) భాష 2) లిపి. భాష భావ ప్రకటనకి సంకేతం అయితే ఆ భాషని రూపుకట్టే సాధనమే లిపి. కాబట్టి భాష లిపికి మూలం అవుతోంది.

ఆదిలో భాష శ్రవణేంద్రియమాత్ర గోచరంగానే ఉండేది. శ్రవణేంద్రియ ప్రవిష్టమైన ధ్వని భావనాపదంలో సంకేత జన్యార్థాన్ని కలిగిస్తుంది. అయితే ముఖయంత్ర - శ్రవణేంద్రియాల అనవస్థలో కానీ, అసాహచర్యంలో కానీ అభిప్రాయ ప్రకటనకి మార్గం లేక అసౌకర్యం కలుగుతుంటే చక్షురింద్రియ గ్రాహకంగా లేఖనాత్మకమైన లిపి భాషకు సంకేతంగా ఏర్పడింది. దీనివల్ల దూరంలో ఉన్నవారికీ అనంతర కాలంలోనివారికీ కూడా భావప్రకటనా సౌలభ్యం కలిగింది. ఇది అన్ని భాషలకీ సామాన్యమే. వక్త్రభేదంగా భాషలిలా అనేక విధాలయ్యాయో లిపులు కూడా అల్లాగే చాలా మార్గాలు త్రొక్కాయి.

లిపి :-

లిప్యతే అనయాపత్రమ్ అని లిపి శబ్దానికి వ్యుత్పత్తి. దీనిచే పత్రము లేక కాగితము పూయబడుతుంది లేక నింపబడుతుంది అని అర్థం. 'లిఖితా' 'లిఖి' అని రెండూ దీనికి పర్యాయపదాలు.

భాషా చారిత్రకులు ఈ లిపి క్రీ॥పూ॥ 3 వేల సంవత్సర ప్రాంతంలో పుట్టి ఉంటుందని ఊహించారు. కానీ హిందూ దేశంలోని లిపి అంతకంటె ప్రాచీనమైనదని సంస్కృత వాఙ్మయం స్పష్టపరుస్తోంది. సంస్కృత మంత్రశాస్త్రంలో అక్షరమాలా రూపంగా వర్ణాలను ఆయా దేవతా మూర్తులకు సంకేతంగా పూజించే సంప్రదాయమే దీనికి ప్రమాణం.

ఈ లిపులు ప్రధానంగా రెండు రకాలు. 1) బ్రాహ్మి 2) ఖరోష్ఠి. బ్రాహ్మిలిపి ఎడమనుండి కుడికి వ్రాయబడుతుంది. ఇది ఉత్తర దక్షిణ భేదంతో రెండు రకాలు. తెలుగు, తమిళము, కన్నడము మున్నగునవి దక్షిణవర్గంలో చేరి ఏక కుటుంబత్వాన్ని పొందాయి. ఇంక కుడినుండి ఎడమకు వ్రాసేది ఖరోష్ఠి లిపి. ఉర్దూ లిపి ఈ జాతిలోనిదే. ఇప్పుడు ఆంధ్ర లిపి-అక్షర సమామ్నాయం పరిశీలించడం ప్రధానోద్దేశం.

అప్పకవీయ చింతామణిలో కొన్ని లిప్యుద్ధారక శ్లోకాలున్నాయి. అందు అకారాది వర్ణాల ఆకారాలు చెప్పబడ్డాయి.

బాలేందు పరిధి శృంగావర్త కుశగ్రంథి దాత్ర పరిఘ సమాః
ఆద్యా ఇభికరతుల్యాః తద్దీర్ఘా శ్చాల సన్నిభా పన్యా
దర శార్ఙ్గ పిప్పల దళాఙ్కుశ పన్నగ సన్నిభాః కుమాత్పురుషాః
స్తమ్భ విలేఖనా ధికై్కః తయేవ వర్గ ద్వితీయ వర్ణాద్యాః
కీర తరి హస్తి మస్తక శుక్తి తులాసన వితర్ది సీరసమాః
అంతస్థాశ్చోష్మాణో దన్త్య చజౌ గురు రలౌచ బిందుయుతౌ.

తెలుగు లిపి స్వరూపాన్ని వివరించి చెప్పిన మొదటి శ్లోకాలివే. ఇవి నన్నయగారు చింతామణిలో చెప్పినట్లుగా 17వ శతాబ్దంలో అప్పకవి లోకానికి అందించాడు. అకారం బాల చంద్రునివలె, ఇకారం సున్న పరిధివలె ఉకారం కొమ్మువలె ఉంటాయని ఈ విధంగా అన్ని వర్ణాలకీ పై శ్లోకాల్లో ఆకారాలు చెప్పబడ్డాయి. పిమ్మట 'వికృతి వివేకం' "పంచ వర్గా దయో వర్ణాః" అని ప్రారంభించి పై శ్లోకాలకి సవరణలు, వివరణలు ఇచ్చింది.

చింతామణిలో కకారం దరం (శంఖం)లా ఉంటుందని చెప్పబడింది (క). ఇట్టి ఆకారంతో వ్రాసి దీనిపై నిలువుగా ఒక గీత పెడితే అప్పుడు 'ఖ' అవుతుంది. రెండు గీతలు పెడితే 'గ' అవుతుంది. ఈ విధంగా ప్రతివర్గులోనూ 5వ అక్షరానికి 4 గీతలుంటాయి. ఈ పద్ధతివల్ల అన్ని వర్గాల్లోనూ ప్రథమ వర్ణాలు తెలిస్తే చాలు వాటిపై క్రమంగా గీతలు పెట్టుకొంటే చాలు మిగిలిన సంకేతాలన్నీ సిద్ధిస్తాయి. అథర్వణాచార్యులు సౌకర్యం కోసం వీటిని సవరించడం జరిగింది. శంఖాకార గుర్తు మీద పైన ఒక గీత పెడితే 'క'కారమూ క్రింద పెడితే ఖ కారమూ అవుతుంది. అల్లాగే రెండుగీతలు పైన పెడితే గ కారమూ క్రింద పెడితే ఘ కారమూ అవుతుంది. ప్రక్కన ప్లస్ ఆకారం గుర్తు పెడితే పంచమాక్షరం అవుతుంది. ఇలా అన్ని వర్ణాల్నీ సవరణ

వివరణాత్మకంగా అధర్వణాచార్యులు చెప్పడం జరిగింది. ఈ రేఖలు ఇప్పటికీ వర్గయుక్కుల క్రింద గీత రూపంగానూ జ, ఇ ల వద్ద కనిపిస్తున్నాయి.

ఈ చెప్పబడిన లిపి ఇపుడు యధాతధంగా లేదు. తలకట్టు, గుడి మున్నగు విధంగా అచ్చుల విహ్నాలలోనూ వ పత్తు (ఁ) మా పత్తు (ꣳ) మున్నగువిధంగా హల్లుల సంకేతాలలోనూ మారి ఉన్నాయి మా వత్తు - పై శ్లోకంలో చెప్పినట్లు అచ్చు పన్నగాకృతిలోనే కనిపిస్తోంది. ఈ విధంగా ఆంధ్ర లిపి ఉద్ధరింపబడినా వ్యవహారంలోకి రాలేదు. ఆంధ్ర కర్ణాటక లిపే నిలిచింది.

ఈ ఆంధ్ర భాషావర్ణాల్ని లిపి తీరుతెన్నుల్ని పరిశీలిస్తే కొన్నింటి అప్రధానత, కొన్నిటి అనౌచిత్యాలూ, కొన్ని అనవసరపు పోకడలూ బయటపడతాయి. వాటిని పరిశీలించవలసి ఉంది.

భాషావర్ణాలు :-

ఆంధ్ర భాషకు వర్ణాలు ఏబది ఐదని పెద్దలు నిర్ణయించారు. అయితే ఇందులో రెండు అభిప్రాయ భేదాలున్నాయి. ప్రౌఢ వ్యాకర్త అచ్చులలో ౡ కారాన్ని కూడా గ్రహించి శకటరేఫని విడిచి పెట్టడం జరిగింది.[1] అమశాసనకర్త ౠకార దీర్ఘాన్ని విడిచి శకటరేఫను గ్రహించి ఆ సంఖ్యని పూరించారు.[2] గురుమూర్తి వ్యాకరణం[3] ౠకార దీర్ఘాన్ని విడిచి శకటరేఫతోబాటు క్షకారాన్ని కూడా గ్రహించి 56 వర్ణాలుగా చెప్పడం జరిగింది. తరువాత కొందరు క్షకారం సంయుక్త వర్ణం కావున దాన్ని విడిచిపెట్టి అటు ౠకార దీర్ఘాన్నీ ఇటు శకటరేఫనీ కూడా గ్రహించడం జరిగింది, ఆ విధంగా ఆంధ్రభాషకు వర్ణాలు 56 అవుతున్నాయి.

ఆంధ్ర భాష అంటె తత్సమ - తద్భవ - దేశ్య - గ్రామ్యాల మిశ్రమం అన్న మాట. కేవల తెలుగులోని వర్ణాలు 37 మాత్రమే. ఈ వర్ణాలకి ఆధారం ఎక్కువగా సంస్కృత భాషావర్ణాలే. ఆంధ్రంలో వర్ణాల సంఖ్యకున్న అభిప్రాయభేదాలవలె సంస్కృతంలో కూడా అంతకంటె ఎక్కువే ఉన్నాయి. యాజ్ఞవల్క్య శిక్ష సంస్కృత వర్ణాలు 56 అని చెబితే పాణినీయ శిక్ష 63 లేక 64 అని చెబుతోంది. శుక్ల ప్రాతిశాఖ్య ఆరణ్యక శిక్షలు 65 అని చెబుతుంటే వ్యాసశిక్ష 66 లక్ష్మీకాన్త శిక్ష ఏకంగా 108 అని చెబుతోంది.[4] వారి అభిప్రాయ భేదాలకి కారణం అక్కడ హ్రస్వ దీర్ఘాది మాత్రాభేదాలూ, ఉదాత్తాది స్వరాలూ, అనునాసిక్యాది ధర్మాలూ ఉండడమే కారణం. ఆ అన్నిరకాలూ లౌకిక సంస్కృతంలోనూ తద్వారా ఆంధ్రంలోనూ ప్రవేశార్హాలయినా కావ్య సంస్కృతంలో మాత్రం ఏభై వర్ణాలే అని వ్యాకర్తలు సూత్రించారు.[5] ఈ 50 వర్ణాలతోబాటు అచ్చతెనుగులో 'ఎ- ఒ- ఁ - చ - జ - ఱ అను 6 వర్ణాల్ని విశేషించి గుర్తించారు కాబట్టి ఆంధ్ర లిపులు 56 అవుతున్నాయి. సాధురేఫ శకటరేఫలకు యతి ప్రాస విరోధం చెప్పిన సంప్రదాయంలో ప్రౌఢ వ్యాకర్త శకట రేఫను ప్రత్యేక వర్ణంగా చెప్పకపోవడం సమంజసం కాదు.

అనవసరపు వర్ణాలు

ఆంధ్రభాషకి వర్ణాలు 56 అయినా అన్నింటికీ ప్రయోజనం లేదు. ఉదాహరణకి దంత్య చ జ లని వేరే చెప్పవలసిన అవసరం లేదు. దంత్యతాలవ్య చ జ లకి ఉచ్చారణలో ద్వైవిధ్యం ఉన్నా లిపిలో లేదు. అంతస్థలకి లఘ్వ లఘూచ్చారణ భేదం ఉన్నా ప్రత్యేక లిపి లేనట్లుగానే చ జ లకే అవసరం లేదు. య-ర-ల-వ ల కంటె వీటి ఉచ్చారణలో మరింత ద్వైవిధ్యం స్పష్టపడుతోంది కదా అని శంకింప నవసరంలేదు. 'తాచేడు - తాటాకు' శబ్దాల ఉచ్చారణలో తాలవ్య - దంత్య భేదం స్పష్టంగా తెలుస్తున్నా తాలవ్య స్వరానికి లిపి లేనేలేదు కదా! కాబట్టి చ - జ లనీ తొలగించవచ్చు.

ఇంక ౠ-ౡ లను కూడా ఆంధ్ర భాషలో గ్రహింప నవసరం లేదు. ౠ కార సహిత పదాలు సంస్కృతంలోనే చాలా తక్కువ. అక్కడ దీర్ఘ ౡకారం లేనే లేదాయె. 'క్లృప్తి' మున్నగు పదాల్ని పలకడంలోనూ, వ్రాయడంలోనూ కూడా లకార ఉత్వాలతోనే జరుగుతోంది కాబట్టి వర్ణాల సంఖ్యనుండి వాటినీ తొలగించవచ్చు.

పై నాల్గు వర్ణాలకీ ఉచ్చారణలోనైనా స్థితి కనపడుతోంది. అరసున్న కయితే తొలగించడానికి ఆ పట్టింపు కూడా లేదు. ఆంగ్లంలోవలె ఇది తెలుగుభాషలో ఒక ప్రత్యేకమైన సైలెంటు వర్ణం. అరసున్న కల పదాలకి విశేషార్థం ఉంటుంది కదా! అది తొలగిస్తే ఎలా? అనే ప్రశ్నకు తావులేదు. ఒకే పదానికి అనేకార్థాలుండడం మనకెలాగూ ఉంది కనుక అరసున్న లేని పదానికే ఆ విశేషార్థమూ చెప్పవచ్చు ఈ విధంగా పై 5 వర్ణాల్ని తగ్గిస్తే నేటి ఆంధ్రభాషకి అక్షరాలా 51 వర్ణాలని చెబితే చాలు.

అనుస్వార విసర్గలు :-

ఇవి భాషలో ఒక ప్రత్యేకమైన వర్ణాలు. ఇవి అచ్చుల సహాయం లేనిదే పలుకబడలేవు కాబట్టి హల్ ధర్మాన్ని పొందు తున్నాయి. హల్లులవలె వీటిపై అచ్చులు చేరవలసిన అవసరం ఉండక అటు అచ్ ధర్మాన్నీ పొందుతున్నాయి. ఈ విధంగా ఇవి ఉభయాక్షరాలని అనుస్యూతంగా వస్తున్న అభిప్రాయం. సంస్కృత వ్యాకర్తలు వీటిని అచ్చుల్లో అకారోపరి, హల్లులలో కర్రులమధ్య పఠించి క్రమంగా జత్వ, ద్విత్వ కార్యాలకి ప్రయోజనాలు కల్పించారు. అయినా వర్ణ పరిగణనలో ప్రామాణికులు అచ్చులుగానే వ్యవహరించారు. సంస్కృతంలో శబ్దశాస్త్రం చాలా విస్తృతమైనది కాబట్టి ఆ ఉభయ విధత్వాంగీకారమూ అక్కడ చెల్లుతుంది. అట్టి ప్రయోజనాలు తెలుగులో లేవు. అయినప్పటికీ ఆంధ్ర వ్యాకర్తలు ఆ పద్ధతినే అనుసరిస్తున్నారు. దీనివల్ల ప్రయోజనం లేదు సరికదా! ఒక సమస్య ఎదురౌతోంది. రాముఁడు, రాముండు మున్నగుచోట్ల అనుస్వార అచ్చు అవడం మూలంగా ఉత్వసంధి, యడాగమాదులు రావలసి వస్తున్నాయి. సంస్కృతంలో 'హరింవందే' మున్నగు స్థలాల్లో యణాదేశాదుల ప్రసక్తి వస్తున్నా "పూర్వత్రా సిద్ధమ్"[6] సూత్రంతో నివారించుకొన్నారు. తెలుగులో అట్టి సూత్రపద్ధతి లేదు. కొందరు సమాన పదంలో సంధి లేదనీ,[7] సంధ్యాదులు వస్తే హల్లుకు తరువాత అనుస్వార ఉండడం జరుగుతోంది కాబట్టి అది ఆంధ్ర భాషా సంప్రదాయం కాదనీ[8] తృప్తి పడబారు. కానీ అసలవి అచ్చులే కాదనుకొంటే బురద కడగవలసిన అవసరం లేదు కదా! సరే! అచ్చులు కాకపోతే హల్లులు కావాలి కదా! నిజమే. కానీ ఇవి హల్లులు కూడా కావు. అనుస్వార విసర్గల యందు అటు అచ్చుల యొక్క ఇటు హల్లుల యొక్క సంపూర్ణత్వం లేనేలేదు. అచ్చుల వలె స్వయంగా పలుకఁబడలేవు కాబట్టి ఇవి అచ్చులు కావు. హల్లులవలె వీనిపై అచ్చులు చేరవలసిన అవసరం లేదు కాబట్టి ఇవి హల్లులూ కావు. ఈ విధంగా ఇవి మరో కోణంలో అనుభయాలవుతున్నాయి. అంటే అచ్చులూ, హల్లులూ కాని మరొక ప్రత్యేక వర్ణాలన్నమాట. అయితే అక్షర సమామ్నాయంలో వీటిని హల్లులు చెప్పిన తరువాత కదా చెప్పవలసినది? అని ప్రశ్న రావచ్చు. కానీ వీటియందు మొట్టమొదట చెప్పినట్లుగా కించిత్ అచ్ ధర్మమూ కించిత్ హల్ ధర్మమూ కూడా ఉన్నాయి కాబట్టి అచ్చులకీ హల్లులకీ మధ్య చెప్పడం జరిగింది.

సంస్కృతంలో వీటిని అకారోపరి పఠించడంవల్ల తెలుగులో కూడా వీటిని అం, అః అనే నిర్దేశిస్తున్నారు. నిజానికి తెలుగులో వీటిని ఇం, ఇః మున్నగు విధంగా ఏ స్వరాన్ని చేర్చియినా నిర్దేశించవచ్చు. సంస్కృతంలో వీటిని ఇకారోపరి పఠిస్తే ఇణ్ ప్రత్యాహారత్వం సిద్ధించి 'పయఃసు' అను లక్ష్యంలో "ఆదేశ ప్రత్యయయోః"[9] అనుసూత్రంచే షత్వం రావలసి వస్తుంది. తెలుగులో ఆ బాధ లేకపోయినా ఆ పద్ధతే అనుసరించడం జరుగుతోంది.

అనుస్వార, విసర్గలః లిపిలో సంస్కృతాది భాషల్లో ఒక చుక్క, రెండు చుక్కలూ వ్రాయడం జరుగుతోంది. తెలుగులో కూడా చుక్కే వ్రాస్తే అరసున్నకి లిపి కష్టం అవుతుంది కనుక సున్నని లిపి సంకేతంగా ఏర్పఱచి సంస్కరించి ఉంటారు.

తలకట్టు :-

లిపిలో తలకట్టు అకారానికి చిహ్నంగా గుర్తింపఁబడుతోంది. కానీ తలకట్టు ఉన్నవన్నీ అకారాంతాలు అయిపోవడమూ లేదు. లేనంతమాత్రాన అకారాంతత కాకపోవడమూ లేదు. ము, ను మున్నగు వర్ణాల్లో తలకట్టు ఉన్నా అవి ఉకారాంతాలే. 'ఖ'-'ల' అనే వర్ణాల్లో తలకట్టు లేకపోయినా అవి అవర్ణాంతాలే,

ఉకార, ఋకారాంతాలలో తలకట్టు కూడా ఉండిపోవడానికి కారణం ఉకారాది చిహ్నాలు తలకట్టు ఉంచిన స్థానంలో పెట్ట నవసరం లేకపోవడమే. ఇకార, ఏకారాది అచ్ చిహ్నాలన్నీ తలకట్టు స్థానంలోనే ఉంచబడుతున్నాయి కాబట్టి అక్కడ దాని అవసరం లేకపోతోంది.

ఒత్వం :-

ఒత్వం పెట్టడంలో తెలుగులో ఒక విశేషం కనబడు తోంది. ఒత్వానికి బదులుగా ఎత్వము, ఉత్వము కలిపి ఒకారానికి సంకేతంగా వ్రాయడం జరుగుతోంది. 'నోరి' 'నోము' మున్నగు శబ్దాల్లో మొన్నటివరకు అలాగే వ్రాసేవారు. ఇప్పటికీ ఆ సంప్ర దాయం ముద్రణలో కూడా యకార-మకారాల మీద ఎల్లప్పుడూ కనపడుతోంది. కానీ ఇందులో కొన్ని అనౌచిత్యాలు అవలంబిస్తు న్నారు. హ్రస్వ ఒత్వం వ్రాసేటప్పుడు హల్లుపై ఎత్వము, ఉత్వమూ ఉంచుతున్నారు. కానీ ఓత్వం వద్ద మాత్రం ఉత్వం పెట్టకుండానే దీర్ఘం పెడుతున్నారు. ఇది చాలా అసంగతమైన విషయం. ఉదాహరణకు మొక్క - యొక్క మున్నగు పదాల్లో ఎత్వ ఉత్వాలు రెండూ కనిపిస్తున్నాయి. మోకు, యోగి మున్నగు పదాల్లో ఉత్వం లేకుండానే సహజ కొమ్ముకు దీర్ఘం తగిల్చి ఎత్వం పెట్టి వ్రాస్తున్నారు. అప్పుడది ఏకారమైనా అవుతుంది కానీ ఓకారం ఎంతమాత్రము అవదు. కాబట్టి ఓత్వం వద్ద కూడా ఉత్వం తగిల్చి దీర్ఘ సంకేతాన్ని పెడితేనే ఓకార స్వరానికి యోగ్యత ఉంటుంది. సంస్కృతంలో ఓకారానికి హ్రస్వంగా ఒకారం రావడం ఈ విధానానికి కొంత ఆధారం కావచ్చు.

జశ్త్వ చర్త్వాలు - వర్గయుక్కులు

వర్గయుక్కులకి తెలుగులో ద్విత్వం వస్తున్నపుడు మరో విశేషం కనబడుతోంది. 'ఆ+ఛత్రము' వద్ద ఛకారానికి ద్విత్వం వస్తుంటే రెండు ఛకారాలు వ్రాయవలసి ఉన్నాయి. కానీ లిపిలో మొదటిది చకారమూ, రెండవది ఛకారమూ వ్రాయబడుతోంది. ఆ ద్విత్వం చతుర్థ వర్ణానికి వస్తుంటే మొదటిది తృతీయ వర్ణంగా వ్రాయడం జరుగుతోంది. దీన్ని తెలుగు వ్యాకర్తలు పట్టించుకో లేదు. సంస్కృతంలో అయితే అక్కడ జశ్త్వ చర్త్వ విధానా లున్నాయి. తెలుగులో కూడా అదే సంప్రదాయం ప్రవేశిస్తోందన్న మాట. ఇక్కడ (అచ్చతెనుగులో) వర్గయుక్కులు లేకపోవడం తెలుగు వ్యాకర్తలకి జశ్త్వ, చర్త్వ విధానాల అవసరం కలగ లేదని ఊహించాలి. అగ్ఘనము, అజ్ఝషము మున్నగు శబ్దాల్లో కూడా మొదటిది తృతీయ వర్ణంగా వ్రాయడమే సత్సంప్ర దాయంగా గుర్తింపవలసి ఉంటుంది.

శ-వ, ర-ఱ, న-ణ, ఋ-ర, థ-ధ వర్ణాల ఉచ్చారణ లోనూ లిపిలోనూ కూడా అసౌకర్యమూ అస్పష్టత గోచరిస్తోంది. ఎక్కడ ఏది పలకాలో ఏది వ్రాయాలో అన్న విషయం అశ్రద్ధ కారణంగా క్రమ క్రమంగా భ్రష్టమై వాటి కభేదత్వం పాటించే దశకు చేరుకొంది. శత్రు శబ్దంవద్ద రేఫ ఉకారాలే వ్రాయాలనీ 'కృష్ణ', 'పితృ' శబ్దాలవద్ద ఋకారమే వ్రాయాలన్నదీ కూడా మరిచిపోవడం జరుగుతోంది. భాషకి మార్పు అత్యంతమూ సహజమే అయినా తత్వాన్నీ సంప్రదాయాన్నీ పరిరక్షించే ప్రయత్నం చేయకపోవడం నిర్లక్ష్యమే అవుతుంది. థ - ధల విషయంలో అయితే లిపిలో కూడా వాటికి చాలా దగ్గఱి సంబంధం ఉండడం మరింత అనవస్థకి కారణం అవుతోంది. ఈ రెంటికీ లేదా పొట్టలో చుక్క మాత్రమే మరీ ఇంత చిన్న విభేదం కల వర్ణాలు ఈ రెండే. సంస్కృతంలో అయితే లిపిలో చాలా భేదం ఉంది కాబట్టి అక్కడ ఈ అసౌకర్యం లేదు. తెలుగులో చాలా మంది ఎక్కడ ఏది వ్రాయాలో తెలియక తికమక పడి యథేష్టంగా వ్రాయడం జరుగుతోంది. ఇవన్నీ అభేద వర్ణాలుగా యథేచ్ఛగా వ్రాసేసుకోవడం లిపిలో ప్రగతిపథం అయినా వీని వైవిధ్యాన్ని, యథా స్వరూపాన్నీ - సంప్రదాయానుసారంగానో యథా సందర్భం గానో తెలుసుకోక తప్పదు.

---

1) ప్రౌఢ వ్యాకరణము - సంజ్ఞ - 1వ సూత్రం. బి. సీతారామా చార్యులు.

2) ఆంధ్ర భాషానుశాసనము. మల్లాది సూర్యనారాయణ శాస్త్రి - సంజ్ఞ-13వ సూత్రం

3) గుటమూర్తి వ్యాకరణం - రావిపాటి గురుమూర్తి శాస్త్రి-అక్షర లక్షణ ప్రకరణం - 1 సూత్రం.

4) సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము - 6వ సంపుటి-ప్రాతిశాఖ్యలు.

5) బాల వ్యాకరణము - చిన్నయసూరి - సంజ్ఞ-1.

6) అష్టాధ్యాయి. 8-2-1

7) ముక్తలక్షణ కౌముది - సంధి - 1వ సూత్రం.

8) రమణీయము - బాల వ్యాకరణ వ్యాఖ్య.

9) బాల మనోరమ-సిద్ధాంత కౌముది వ్యాఖ్య - 'విసర్జనీయస్య సః' (8.3.34) సూత్రవ్యాఖ్య.

# కలగూరగంప

## 'భారతి' 66వ సంపుటము (1989) విషయానుక్రమణిక

### 1. వ్యాసములు

| శీర్షిక | రచయిత | సంచిక సంఖ్య |
|---|---|---|
| అచ్యుతరాయ శతకము | కీ.శే. కే. యస్. కోదండరామయ్య | 6 |
| అనుభూతి కవిత్వం | ఆర్. యస్. సుదర్శనం | 10 |
| అనేక అపవాదాల నిత్యవిధి (కల) | వై. రామకృష్ణారావు | 6 |
| అర్జున విషాద యోగం - అశోక విషాద యోగం | డా॥ పి. వి. రామకృష్ణారావు | 8 |
| ఆంధ్ర పుట్టుపూర్వోత్తరాలు - ఒక పురాతత్వ పరిశీలన | డా॥ టి. వి. జి. శాస్త్రి | 1 |
| ఆధునిక కళలకు శాస్త్రీయ విజ్ఞానమే అధిష్ఠానం! | సోమసుందర్ | 7 |
| ఆశోపహతుని లేఖ (కల) | రాళ్ళబండి కవితా ప్రసాద్ | 1 |
| ఇటీవల లభించిన ఐదు తాళపత్ర గ్రంథములు (కల) | కొమాండూరి రామానుజాచార్యులు | 7 |
| ఈ మాసం - మీ నక్షత్రఫలం | విష్ణల వేంకట సత్యసుబ్రహ్మణ్యం | 1, 3, 4, 5 |
| ఏలువ భీమ - మైలమ భీమ ఒకటి కాదు | తురగా కృష్ణమూర్తి | 9 |
| ఏలువ భీమ - మైలమ భీముల వ్యక్తినిరూపణము | ,, | 3 |
| ఒక చిన్న పాఠభేదం - పెద్ద చర్చ | కాటూరి హనుమంతరావు | 10 |
| కన్యక కథ - విష్ణువర్ధనుని చారిత్రకత! | డా॥ కొల్లూరి సూర్యనారాయణ | 8 |
| కన్యాశుల్కంలో తప్పిద్ధి పొందిన హాస్యం | కాలువశ్రీ | 3 |
| కవిజనాశ్రయ విషయము (లేఖ) | డా॥ ఆర్. శేషశాస్త్రి; జె. సదానందం; డా॥ సూర్యదేవర రవికుమార్ | 12 |
| కవిత్వము - లక్షణము | చివుకుల వేంకట సుబ్బావధానులు | 6 |
| కవిత్వ లక్షణ పర్యాలోచన (కల) | సౌదర్శిని | 11 |
| కవి సమ్రాట్టుల కవితా తపస్సు | జి. వి. సుబ్బారావు | 5 |
| కుమార భారతి - అభిషేక గాథ | డా॥ ఎ. హనుమంతప్ప | 10 |
| 'కుమార భారతి' - కావ్య ముఖపత్రాల అధ్యయనం | పి. ఓబులేసు | 11 |
| కుమార భారతి - కుమార జననం | డా॥ ఎ. హనుమంతప్ప | 4 |
| కృష్ణరాయల ఆస్థాన కవులు (కల) | సూర్యదేవర రవికుమార్ | 4 |
| (కల) | చింతలపూడి వేంకటేశ్వర్లు | 8 |

| | | |
|---|---|---|
| కృష్ణశాస్త్రి వచన రచన | వేముగంటి నరసింహాచార్యులు | 12 |
| కృష్ణస్య మానుష రూపం (కల) | డా॥ గంటి శ్రీరామమూర్తి | 7 |
| కొన్ని శబ్దార్థాలు | శాఖారి హనుమంతరావు | 6 |
| కొన్ని సాహిత్య మర్మాలు (కల) | బయిరెడ్డి సుబ్రహ్మణ్యం | 7 |
| కోమర్రాజువారు వెలార్చిన విజ్ఞాన చంద్రికలు | సోమసుందర్ | 5 |
| గాలిబ్ కవిత్వంలో జీవన రేఖలు | డా॥ ఎం. బుద్ధన్న | 8 |
| గాలిబ్ ప్రణయ కవితా తత్వం | ,, | 9 |
| గోత్రం - ఒక పరిశీలన (కల) | డా॥ ఎం. విజయలక్ష్మి | 3 |
| గ్రామదేవతలు | కోటి సూర్యనారాయణమూర్తి,<br>ఆచార్య యస్వీ జోగారావు | 8 |
| చక్కటులు - సామెతలు (కల) | అవధానం నాగరాజారావు | 1 |
| చత్వారివాక్ (కల) | సర్దేశాయి తిరుమలరావు | 5 |
| (కల) | యస్. టి. పి. వి. రామానుజాచార్యులు | 8 |
| జనసంస్కృతి - శిలా శాసనములు సామెతలు | పెద్దమఠం ప్రభులింగ దేవర | 3 |
| తుమ్మలవారి కవితాకళ | సూర్యదేవర రవికుమార్ | 6 |
| తుమ్మలవారి తొలి రచనలు | ,, | 3 |
| తెలంగాణ విప్లవ పోరాటం | దిలావర్ | 7 |
| తెలుగులో బాల సాహిత్యం | డా॥ వెలగా వెంకటప్పయ్య | 12 |
| తెలుగు శతకాలు - యతి ప్రాసల పరిశీలనం | కపిలవాయి లింగమూర్తి | 7 |
| త్రివిక్రముని త్రిపాదములు (కల) | పైథగరస్ | 1 |
| దంతవరపు కోటయే ప్రాచీన దంతపుర నగరము | బెల్లంకొండ రమేష్‌చంద్రబాబు | 7 |
| దొండపాడు శిలాశాసనములు | బి. యస్. శాస్త్రి | 6 |
| ద్వాదశాదిర్వాది పద సముచ్చయాలకు అర్థం ఏమిటి? (లేఖ) | గడియారం హిరణ్మయి | 6 |
| (కల) | భాగవతుల ఉమామహేశ్వర శర్మ | 8 |
| (లేఖ) | జి. వి. ఆర్. చంద్రమౌళి | 10 |
| నందవనవర్తి (కల) | కపిలవాయి లింగమూర్తి | 3 |
| నన్నయభట్టు - ఆంధ్రభారత రచన | కీ.శే. కే. యస్. కోదండరామయ్య | 4, 5 |
| నన్నయ - వృత్తౌచిత్యం (కల) | డా॥ చిలకమర్తి దుర్గాప్రసాదరావు | 4 |
| నరస నాయకుడు - అన్నమయ్యగారు | కీ.శే. కే. యస్. కోదండరామయ్య | 12 |
| నలభై ఏండ్ల భారతి పాఠకుని అస్తమయం (కల) | ప్రసాదరావ్ జిప్పి | 5 |

| | | |
|---|---|---|
| నారికేళం (లేఖ) | వైద్య వమ్మి సత్యనారాయణ శాస్త్రి | 6 |
| (కల) | డా॥ సూరం శ్రీనివాసులు | 8 |
| (లేఖ) | చివుకుల వేంకట సుబ్బావధానులు | 12 |
| నిఘంటువులు (కల) | టి. శ్రీరంగస్వామి | 12 |
| నిత్య జీవితంలో అలంకారాల వాడుక | పి. ఓబులేసు | 8 |
| పాతర్లపాడు శిలాశాసనము | వి. యస్. శాస్త్రి | 12 |
| పాలమాచాపురి - కనకఖండనపురి | నాయని సత్యనారాయణరావు | 4 |
| పూజారహస్యము (కల) | వసంతరావు వేంకటరావు | 4 |
| ప్రతీక - పరిశీలన | పెన్నా శివరామకృష్ణ | 4 |
| (కల) | డా॥ గంటి శ్రీరామమూర్తి | 6 |
| ప్రాచీన భారతదేశములో గ్రామీణ న్యాయపంచాయతీలు | పి. ముత్తయ్య | 9 |
| ప్రీ హిందీ - తెలుగు | ఆచార్య జాస్తి సూర్యనారాయణ | 4 |
| బహదూర్‌షా - బంధగీతి (కల) | సి. ఓబులేసు | 11 |
| భక్తి సంప్రదాయం (కల) | శివలింగం | 8 |
| భగవంతుడు, భక్తుడు - సంబంధ బాంధవ్యములు (కల) | విశ్వంక తిమ్మన్న | 4 |
| భారతి 59వ సంపుటము అకారాది విషయానుక్రమణిక (కల) | సూర్యదేవర రవికుమార్ | 9 |
| భారతీయ సాహిత్యంలో 'ఊర్వశి' తత్వము (కల) | డా॥ కల్లూరి శ్యామల | 3 |
| (కల) | జానమద్ది హనుమచ్ఛాస్త్రి | 6 |
| భారతేందు వీరేశలింగం పంతులుగారి నాట్య దిగ్దర్శిక (కల) | డా॥ రామస్వారథ్ మిశ్ర | 12 |
| మన పురాణాలలోని జాంతవ వంశాలు | కపిలవాయి లింగమూర్తి | 10 |
| మన్నారు రంగాష్టకం (కల) | ,, | 5 |
| మఱుగున పడిన మధురకవి శ్రీ మల్యాల జయరామయ్య | డా॥ పోచిరాజు శేషగిరిరావు | 11 |
| మాదిరాజు ముక్తకాలు'- ఒక పరిశీలన | పాతూరి రఘురామయ్య | 9 |
| మినీ కవితాలోకం (కల) | యస్. టి. పి. వి. రామానుజాచార్యులు | 1 |
| "యోగభ్రష్టుడు" గురజాడ గిరీశం | కాలువశ్రీ | 8 |
| వసుచరిత్రకారునిపై కాళిదాసు ప్రభావం | డా॥ చిలకమర్తి దుర్గాప్రసాదరావు | 10 |
| వాసవి కన్యక - విష్ణువర్ధనుడు | తురగా కృష్ణమూర్తి | 5 |
| విజయనగర సామ్రాజ్య మెంతకాలము జీవించియుండెను? | కీ.శే. కే. యస్. కోదండరామయ్య | 9 |
| వివేక చింతామణి - విజ్ఞాన సర్వస్వ వ్యవదేశార్హత ఒక పరిశీలన (కల) | గొల్లకోట సూర్యభాస్కరరావు | 11 |

| | | |
|---|---|---|
| విశ్వనాథ - అస్థిపంజరము (కల) | అల్లాడి వేంకటాద్రి | 1 |
| విశ్వనాథ పంచశతి - సమీక్ష (కల) | డా॥ ఎ. పద్మజాం | 10 |
| వీరభక్తి (కల) | గొల్లకోట సూర్యభాస్కరరావు | 8 |
| వీరభద్రుని అర్థాలు (కల) | కపిలవాయి లింగమూర్తి | 1 |
| వీరశైవ పదచర్చ (కల) | ఈ | 10 |
| శతాబ్ది పూరము నధిగమించిన వేంకట పార్వతీశ్వర కవులు | డా॥ చల్లా రామచంద్రశాస్త్రి | 3 |
| శివభక్తి | హెచ్. ఎస్. బ్రహ్మానంద | 1 |
| శేషేంద్ర కవిత - సామాజిక చైతన్యం | డా॥ పెన్నా శివరామకృష్ణ | 10 |
| శ్రీధాన్యకటకమున శైవము - అమరేశ్వరాలయ ప్రాచీనత | డా॥ పురాణం రాధాకృష్ణ ప్రసాద్ | 11 |
| శ్రీమద్భాగవతంలో నవవిధ భక్తులు | డా॥ వి. సత్యనారాయణ | 1 |
| శ్రీమద్రామాయణము - నామ రామణీయకము (కల) | కొవెరపు వెంకట్రామయ్య | 9 |
| షష్ఠే చ త్వాం తథా కాలే (కల) | కాటూరి హనుమంతరావు | 5, 12 |
| (కల) | మానాప్రగడ ప్రకాశం | 6 |
| సంజ్ఞాభాష (కల) | సర్దేశాయి తిరుమలరావు | 8 |
| సాంస్కృతిక సజీవరూపం శ్రీ విద్యారణ్యస్వామి | మాదిరాజు రంగారావు | 3 |
| సీతారాముల అనురూపాకృతులు (కల) | యస్. టి. పి. వి. రామానుజాచార్యులు | 12 |
| 'సుభద్రా కళ్యాణము'లో స్త్రీ స్వభావ చిత్రణం | డా॥ గుమ్మా సాంబశివరావు | 8 |
| సూఫీ తత్త్వము - ఋతస్యపంథా | ఈ | 11, 12 |


## 2. కథలు, నాటికలు


| | | |
|---|---|---|
| అంగుళమునకు గళము (పద్యనాటకము) (అను) | శంకరగంటి రంగాచార్యులు | 11, 12 |
| అడవులు పిలిచాయ్ | పాలడుగు వేంకటేశ్వరరావు | 3 |
| ఆ దినపు వేట | శంకరగంటి రంగాచార్యులు | 10 |
| ఆరు నెలలు | అరవింద | 5 |
| ఇంకొక్క ముఖం (అను) | శంకరగంటి రంగాచార్యులు | 1 |
| ఉంగరం (అను) | కె. సుబ్రహ్మణ్యం | 7 |
| చితిమీది బ్రతుకులు | కొచ్చర్లకోట వెంకట సుబ్బారావు | 4 |
| జనార్ధనీయం | ఏల్చూరి షణ్ముఖ రామష్మరావు | 1 |
| తొట్ల ఊగింది (అను) | శంకరగంటి రంగాచార్యులు | 8 |
| ....నేనెవరిని | [illegible] | 6 |

| | | |
|---|---|---|
| పద్మావతీ చరణ చారణ చక్రవర్తి (నాటిక) | తి | 9 |
| పులి (అను) | కె. సుబ్రహ్మణ్యం | 6 |
| బతికే వున్నారు (అను) | కాలిపు వీరభద్రుడు | 9 |
| బాధమ్మ | డా॥ పి. శరావతి | 5 |
| షీరా | కాకులపాటి గురుమూర్తి | 9 |
| వుతురు | అదిత్య | 7 |


## 3. కవితా రచయితలు


| | | | |
|---|---|---|---|
| అవంత వెంకటేశన్ | 6, 8, 11 | దిలావర్ | 4, 8, 11 |
| అశోక్‌కుమార్. మోతుకూరి | 4 | వనారా | 11 |
| ఆదిశేషయ్య | 12 | నరసింహాచార్యులు. వేముగంటి | 8 |
| ఎం. ఎస్. ఎం. | 12 | నాగభూషణం. కాసల | 6, 11 |
| ఒబ్బిని | 10 | నాగభూషణాచార్య. ఏలేశ్వర | 10 |
| కమల్ | 10 | నాగరాజు. భువనగిరి | 9 |
| కామేశ్వరరావు. పి. | 3, 10 | నాసరరెడ్డి. గాలి (అను) | 3 |
| కాశీదాసు. వఝల | 3, 11 | నిఖిలేశ్వర్ | 11 |
| కిశోర్‌బాబు, అశోక్‌బాబు | 3, 5, 7 | పూర్ణచంద్. మంగళగిరి | 1 |
| కృష్ణ. సి. బి. | 6, 8, 14 | ప్రభంజన॥ | 7, 11 |
| కృష్ణమూర్తి. గన్ను | 4 | బాలయ్య. దశరథుల | 9 |
| కృష్ణారావు. పైల | 5, 8, 12 | మణిగోపాల్ | 4, 5, 7, 12 |
| కృష్ణారెడ్డి. పులికంటి | 1 | మాధవుడు. మంగిపూడి | 10 |
| ఖ్రైమొద్దీన్ | 4, 8, 12 | ముత్యాల | 7 |
| గోదావరి శర్మ. కె. | 8, 11 | రంగారావు. మాదిరాజు | 1, 10 |
| గోపాలకృష్ణ. దేశపతి | 4 | రఘురామయ్య. పాతూరి | 11 |
| చంద్రమౌళి. జి. వి. ఆర్. | 1, 3 | రఘురూప. రాగమాలిక | 9 |
| చంద్రశేఖర్. కోటం | 1 | రఫి | 10 |
| చంద్రశేఖర శాస్త్రి. ఆర్. | 11 | రమేష్‌బాబు. గుమ్మనూరు | 3, 5, 6, 8, 10, 12 |
| జిప్పి | 4 | రవికుమార్. సూర్యదేవర | 3, 5 |
| తంగిరాల | 8 | రాఘవాచార్య. కందాళై | 1 |
| తాతారావు. చొక్కాత | 3 | రామకృష్ణమూర్తి. కొంపెల్ల | 7, 11 |
| తిరునగరి | 6, 7 | రామారావు. దాసరాజు | 7 |
| దినకర్. కె. | 11 | రామారావు. మల్లాప్రగడ | 1 |

రామ్మోహనరావు. చెన్నోజు 6, 10
రెడ్డి. యస్. యస్. 10
లక్ష్మి. యం. వి. 8
లక్ష్మీనారాయణాచార్యులు. శేషం 7
లింగన్న. కాశిపాకం 12
లింగమూర్తి కపిలవాయి 8
వల్లభాచార్య 9
విజయ రాఘవరావు. ఏల్చూరి 9
వెంకటరత్నమ్. ఆడిగోపుల 4, 5
వెంకటశాస్త్రి. కూచిభొట్ల 3
వెంకట సీతారామమూర్తి. ఆదూరి 9
వెంకట సుబ్బారావు. తంగిరాల 4
వేంకట విజయబాబు. కస్తల 8
వేంకటేశ్వర్లు. బులుసు 9
శివకుమార్. వయల 12
శివలింగం 4
శివాజీ. యలమంచిలి 5, 9
శేషఫణి శర్మ. గడియారం 6, 12
శ్రీకాంత శర్మ. ఇంద్రగంటి 9
శ్రీమన్నారాయణ. పాటిబండ్ల 12
శ్రీరామమూర్తి. కొడిమెల 4
సంజీవరావు. సింగిసెట్టి 9
సదాశివుడు. యం. 12
సాంధ్యశ్రీ 8
సుబ్బారావు. జి. వి. 4
సుబ్రహ్మణ్యం. భాగవతుల 3
సూర్యనారాయణ. యం. యస్. 11
సూర్యనారాయణరాజు. మంతెన 8
సౌ ... ... 4
సౌభాగ (అను) 6, 12


కల : కలగూరగంప అను : అనువాద రచన

# కాకతీయుల కులము- సందేహములు

సూర్యదేవర రవికుమార్

కాకతీయుల గురించి తెలిసిన దానికంటె తెలియనిదే ఎక్కువన్న విషయం చరిత్ర చదివిన, తెలుసుకున్న, పరిశోధన జరిపిన ప్రతి ఒక్కరూ ఎరిగిన విషయం. ప్రత్యేకించి వారి కులం, వారి పూర్వుల విషయంపై ఇంతవరకు ఏమాత్రం కృషి జరుగలేదనే చెప్పాలి. కాకతీయుల పూర్వుల విషయంలో క్రీ॥శ॥ 956 సంవత్సరంలో దానమిచ్చిన మాగల్లు శాసనము మొదటిది. దాని తరువాత మనకు దర్శనమిచ్చిన దాన శాసనము దాదాపు 90 సంవత్సరాల నాటిది. ఈ మధ్యకాలములోని చరిత్ర నిర్మితము కావలసి ఉంది. కాకతీయుల కులం గురించిన వ్యాసమిది.

కాకతీయులు చతుర్థ కులజులని పెక్కు పరిశోధకు లంగీకరించిరన్న విషయం విదితమే.[1] గణపతి దేవుడు, రుద్రమదేవిలు దానం చేసిన దాన శాసనములలో తాము సూర్య వంశ క్షత్రియులమని, తాము మను, కరికాళ, ఇక్ష్వాకు, మాంధాత, భగీరథ, రఘు, దశరథ, రామ వంశజులమని, ఈ వంశములలోనే దుర్జయ మహారాజు జనించినాడని, వారి తరువాత ప్రోలరాజు వరకు రాజ్యపాలనము చేసినారని చెప్పుకొనిరి. ఈ రెండు ఆధారాలు కాకతీయులు క్షత్రియ కులజులని అందులోను సూర్యవంశ క్షత్రియులని చెప్పుటకు తగినవై యున్నవి.

కాని కాలాంతరమున సమకాలీన సాహిత్యంలోను, శాసనాలలోను దానికి భిన్నముగా కుల ప్రస్తావన చాల కొద్ది శాసనాలలో ప్రసక్తమై యున్నది. పెక్కు శాసనములు కుల ప్రసక్తి, ప్రస్తావన చేయకుండాను, కనీసం గోత్రమైనను చెప్ప లేదు. ఇది మిగిలిన రాజుల విషయంలోను జరుగలేదు కాబట్టి వారి విషయం మరింత జటిలమైపోయింది.

కాకతీయుల కుల ప్రస్తావన తెచ్చిన రెండు మూడు శాసనాలను ప్రస్తుతం పరిశీలన చేస్తూ నిర్ధారిద్దాం. గణపతి దేవుని తన పుత్రికల వివాహబంధాలను ఎక్కువగా చతుర్థ కులజులతో జరిపినట్లు మనం గ్రహించవచ్చు. నతవాటి రాజులకు, కాకతీయు లకు వివాహ సంబంధాలు మూడు నాలుగు తరాలుగా జరుగుతూ వచ్చాయి. పైగా వారిని సవర్ణులుగాను, నతవాటి రాజులు

చతుర్థ కులజులనియే తెలుపుచున్నది. వారి అమరావతి, బోధపూర్, వర్ధమాను శాసనములు కాకతీయులు ఈ విషయాన్ని నిర్ద్వంద్వముగా తెలుపుచున్నవి.

అయితే సమకాలీనులు వారిని క్షత్రియులుగా పేర్కొను టకు కారణమేమిటి? అన్న ప్రశ్నకు సమాధానం ఏమిటి? అనుకొని ముందుకు దృష్టి సారిస్తే వారు క్షత్రియులు కారు కాని క్షాత్ర ధర్మాన్ని నెరవేర్చి ధాత్రీశులైన కారణంగా వారిని సమకాలీన కవులు క్షత్రియులుగా పేర్కొని ఉండవచ్చు. ఆ సందర్భంగానే వారిని సూర్యచంద్ర వంశజులని పేర్కొనటం జరిగింది.

కాకతీయులకు, విరియాల వారికి గల సంబంధం మొట్ట మొదట గూడూరు శాసనములో పేర్కొనబడింది. వీరు చతుర్థ కులజులని ప్రాక్ చారిత్రక పరిశోధకులు పేర్కొన్నారు.

మాగల్లు శాసనములో దానార్ణవుడు గుండయ్య చెప్పిన దొమ్మన శర్మకు సాధికారముగా దానమిచ్చినాడు ఈ శాసనము లోని సామన్త "ఒడ్డి" సంజ్ఞ కులమునకు చెందినవాడని చెప్పు చున్నారు. ఆ పంక్తులలో గల వాక్యాన్ని చూచినట్లైతే వారు "ఒడ్డెర" కులమునకు చెందినవారనియే భావించవలసి వస్తున్నది. ఆ పంక్తులు "సామన్త ఒడ్డి సంజ్ఞాంకులం అపిజ్జలనిధి ప్రతిమం తద్వంశవారి నిధి వృద్ధికర భటాంధకారః అపిత్ శశాంక గవ గుండియ రాష్ట్రకూట" అని తన గురించి రాష్ట్రకూట గుండియ చెప్పుకున్నాడు. తాను సామన్త "ఒడ్డి" కులమునకు సంబంధించిన వాడనని, జలనిధి ప్రతిముండును, తద్వంశవారినిధి వృద్ధికరుడని ప్రశంసించబడినాడు. జలనిధి ప్రతిముడు సాగరుడని యర్థం చెప్పుకొనవలయును. సాగరు లన "ఒడ్డె ఉప్పర" కులమని యనుకొనవలసి వస్తున్నది. నామ సామ్యము, పూజాదికములు వారు చేసిన అనగా మొదటి కాకతీయులు పూజించిన దేవతలను చూచినట్లైతే వారు "ఒడ్డె ఉప్పర" అన సాగరులనియే భావన చేయవలసి వస్తున్నది. ఇవికాక ఇంకా వీరి శాసనములు ఇంకొన్ని దొరికిన ఇంకా ఎక్కువ వివరములు సేకరించుటకు అవకాశమున్నది.

1) శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి, కాకతీయాస్, పేజీ-27.

2) ఇ । 6, పేజీ-157 మరియు కార్పస్ 2, పేజీ-154, లైన్స్ 61 నుండి 65 మరియు కార్పస్ 3, పేజీ-100, లైన్స్ 12 నుండి 17.

**ఇవటూరి యోగదుర్గా మల్లికార్జున**

# షట్

"షట్" అంటే ఆరు. ఆరు అంటె మహిమాన్వితం. ఆరు సంఖ్య విలసనాన్ని ఉదాహరణలతో దర్శిస్తాము గాక!

* కాలమానంలో "ఆరు" రూపాలు :

| | | |
|---|---|---|
| 60 సెకండులు | = | 1 నిముషం |
| 60 నిముషాలు | = | 1 గంట |
| 24 (4x6) గంటలు | = | 1 దినం |
| 30 (5x6) దినములు | = | 1 నెల |
| 12 (2x6) నెలలు | = | 1 సంవత్సరం |
| 60 (10x6) ఏండ్లు (ప్రభవ - లక్షయ) | = | 1 షష్ఠి వలయం. ఇదే షష్ఠిపూర్తి |
| రాశులు (మేష - మీన) | = | 12 |
| ఋతువులు (వసంత-శిశిర) | = | 6 |
| ఆదిత్యులు | = | 12 |

* షడక్షరములు : ఓం న మ శి వా య

* షట్చక్రవర్తులు : హరిశ్చంద్ర, నల, పురుకుత్స, పురూరవ, సగర, కార్తవీర్య.

* షడ్రసములు : తియ్యదనం, పులుపు, కారం, చేదు, ఉప్పు, వగరు వీనిని షడ్రుచులు అని కూడా అంటారు.

* ఈతి బాధలు : అతివృష్టి, అనావృష్టి, ఎలుకలు, చిలుకలు, మిడుతలు, పొరుగురాజు (స్వదేశరాజూ ఈతిబాధ క్రింద లెక్కే.) ఇవన్నీ ముఖ్యంగా రైతుకే బాధలు. వేదంలోని దాశరాజ్ఞయుద్ధం నదీ నీటి పంపకానికైన తగాదా. మహాభారతం లోని ఉత్తర దక్షిణ గోగ్రహణ యుద్ధాలు, కాటమరాజు-నల్ల సిద్ధి పుల్లరి యుద్ధం శత్రు రాజులు రైతుల పాడిపంటలపై ఎట్లు దాడి చేస్తారో తెలుపుతాయి.

* షడ్గురువులు : "నా దగ్గర ఆరుగురు విజ్ఞాయుతి ఆసాము లున్నారు. నాకు తెలిసినదంతా వారే నేర్పిరి. వారి పేర్లు, ఏమి, ఏల, ఎప్పుడు, ఎచ్చట, ఎట్లు, ఎవరు" అన్నాడు రడ్యార్డ్ కిప్లింగ్.

* షడ్బాంధవులు : "షడైతే మమ బాంధవా", "ఆర్గురే బంధువులు నాకు" అన్నాడు ధర్మరాజు. భీమ, అర్జున, నకుల సహదేవ, ద్రౌపది, కుంతి కాదట! సత్య, దయ, ధర్మం, అహింస, క్షమ, ఆర్జవం వంటి గుణాలట!

* అరిషడ్వర్గాలు : కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు.

* రామాయణ భాగాలు : బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధకాండలు. ఉత్తర రామాయణం ప్రత్యేకం.

* షడంగములు : చిత్రం ఆరు గుణాలు (అంగములు) కలిగి వుండవలెనని భరతుడు "నాట్య శాస్త్ర"మున చెప్పినాడు. అవి: రూపభేదం, ప్రమాణం, భావం, లావణ్యం, సాదృశ్యం వర్ణికా భంగం. పాశ్చాత్యుల ప్రకారమూ ఇవే చిత్రకళాంగాలు.

* షడ్దర్శనములు : సాంఖ్యం (కపిలుడు), యోగం (పతంజలి), న్యాయం (గౌతమ అక్షపాదుడు), వైశేషిక (కణాదుడు), మీమాంస (జైమిని), వేదాంతం (వేదవ్యాసుడు).

* షణ్మతములు : ఆది శంకరుడు ఆరు మతాల (సాత్విక పూజాక్రమాలు) స్థాపించెను. అవి: సూర్య, గణపతి, కుమార స్వామి, శివ, శక్తి, విష్ణు దేవపరములు. ఆది శంకరునకు "షణ్మత స్థాపనాచార్య" అని పేరు.

* ఆరు శక్తులు : ఇచ్ఛ, జ్ఞాన, క్రియ, ఆది, పరా, చిత్ శక్తులు.

* వేదాంగములు: శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం.

* షట్కర్మలు : అధ్యయనం, అధ్యాపనం, యజనం, యాజనం, దానం, ప్రతిగ్రహం.

* షట్పదార్థములు : వైశేషిక దర్శనంలో ఆరు పదార్థములు ("కటిగరీ"లు) ప్రతిపాదితాలు. అవి: ద్రవ్యం, గుణం, కర్మ, సామాన్యం, విశేషం, సమవాయం.

* బీజాక్షరములు : అం, ఈం, ఊం, ఐం, ఔం, అః
రాం, రీం, రూం, రైం, రౌం, రః
హ్రాం, హ్రీం, హ్రూం, హ్రైం, హ్రౌం, హ్రః
క్లాం, క్లీం, క్లూం, క్లైం, క్లౌం, క్లః

* మంత్ర శబ్దాలు : వేదముల మంత్రాలలో వాడే శబ్దాలు (పల్లవాలు) నమః, స్వాహా, హుం, ఫట్, వషట్, వౌషట్.

* షడ్విధ ముక్తులు : సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య, సార్ష్టిత్వ, కైవల్యములు.

* షట్ స్థలములు : వీరశైవ మతంలో శివసాయుజ్యానికి ఆరు మెట్లు చెప్పబడినాయి. అవి: భక్త, మహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యము - వీనికి "స్థలములు" అంటారు.

* ఆరు హసితములు : స్మిత, హసిత, విహసిత, ఉపహసిత, అపహసిత, అతిహసితములు.

* తేనెతెట్టు షడ్భుజాకార గూళ్ళు కలిగి వుంటుంది. ఈ షడ్భుజాకారం 6 సమాన భుజాలు, 6 సమాన కోణాలు కల్గి వుంటుంది. ఒక్కొక్క కోణం 120°. దీనికి "క్రమ షడ్భుజం" (రెగ్యులర్ హెక్సగన్) అని పేరు. కార్బనిక రసాయన శాస్త్రంలో ఆరోమాటిక్ రసాయనాలు క్రమ షడ్భుజాకార బెంజీను వలయ జన్యాలు.

క్రమ షడ్భుజం ప్రకృతిలో అతి స్థిర నిర్మాణమంటారు.

* షణ్ముఖుడు : కుమారస్వామికి ఆరు మొగాలు. "ఆర్ముగం".

* "ఆరువేల నియోగులు" అనే బ్రాహ్మణ శాఖ కలదు.

* ముస్లిముల పాలన : ఢిల్లీని ఆఫ్ఘనులు 333 ఏండ్లు, మొగలులు 333 ఏండ్లు, మొత్తం 666 ఏండ్లు (క్రీ.శ. 1192-1858 వరకు) పాలించిరి.

* పూర్వకాలంలో రాజుకు ఆదాయంలో ఆరవ భాగం పన్ను చెల్లించవలసి వుండేది.

* పంచ జ్ఞానేంద్రియాలకి సాధ్యం కాని విషయాన్ని పసిగట్టే శక్తిని "షష్ఠమతి" ("సిక్స్త్ సెన్స్") అంటారు. గుర్రానికీ ఈ శక్తి వుంటుంది కాన, "అశ్వమతి" ("హార్స్ సెన్స్") అని కూడా అంటారు.

తోక తునక : ఇంగ్లీషు మీడియం స్కూలులో చదివే మా వాణ్ణి, "షట్" అని వచ్చే ఏ మాటైనా చెప్పురా అని అడిగితిని. వాడు టపీమని "షటప్" అన్నాడు. ఇక బుద్ధి వచ్చింది అని ముగించినాను.

పైథాగొరస్

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన ఆముదము




శుద్ధి
చేసినది,
వాసన
లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

## జయంతుడు రక్కసుడా?

అక్టోబరు 1989 భారతిలో శ్రీ కపిలవాయి లింగమూర్తి "మన పురాణాలలోని జాంతవ వంశాలు" అనే వ్యాసంలో "గరుడులు" అనే తెగని వివరిస్తూ జయంతుడు రక్కసుడని పేర్కొన్నారు—

శ్రీమద్రామాయణం, సుందరకాండ, 38వ సర్గంలో సీతమ్మ హనుమంతునితో, రామునకు చెప్పవలసినదంటూ, అభిజ్ఞానంగా, ఈ వాయస వృత్తాంతం చెబుతుంది.

సీతా సౌందర్యానికి ముగ్ధుడై ఇంద్ర పుత్రుడైన జయంతుడే, వాయస రూపంతో వచ్చి సీతా స్తనద్వయాన్ని నఖాగ్రాలతో గుచ్చి బాధించినట్టు, నిద్రాభంగం రామునకు కలగరాదనే ఉద్దేశ్యంతో, సీతమ్మ ఆ బాధను సహించినట్టు, వివరింపబడి వుంది—

"వీక్షమాణ స్తత స్తం వై వాయసం సముదైక్షత
నఖైస్స రుధిరై స్తీక్ష్ణైర్మామే వాభిముఖం స్థితం" 27
"పుత్రః కిల స శక్రస్య వాయసః పతి తాంపరః
ధరాంతర గతః శీఘ్రం పవన స్యగతౌ సమః" 28
"స పిత్రాచ పరిత్యక్తః సురైశ్చ సమహర్షిభిః
త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య త్వ మేవ శరణం గతః" 33
శ్రీమద్రామాయణం - సుందరకాండం.

ఈ శ్లోక ప్రామాణ్యాన్ని గుర్తిస్తే జయంతుడే వాయస రూపం ధరించి వచ్చాడనీ, అతడే సీతా స్తనాంతర వ్యధా కారకుడనీ, తెలుస్తోంది కదా! జయంతుడు రక్కసుడెలా అవుతాడు?- లేక మరొకడున్నాడా?—

**ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులు**

## లేఖ

## 'అంగుళమునకు గళము' నందలి అంతర్వేదన

1989 నవంబర్, డిసెంబర్ 'భారతి' సంచికలలో ప్రచురితమైన 'అంగుళమునకు గళము' అన్న పద్య నాటకం కరుణ రసాత్మకంగా భక్తి రసాత్మకంగా వాత్సల్య ప్రేయోరసభరితంగా ఉన్నతమైన సందేశ సహితంగా అలరారింది.

ద్రోణ పాత్ర అంతర్నిబిడావేదనను వివరముగా చిత్రించి ఆ పాత్రకు ఊపిరి పోసిన రచయితకు నా అభినందనలు.

'ఈ అహంకారమే మూల మన్నింటికిని' వంటి పాదాలు మానవున్ని చింతనా మార్గంలోకి తీసుకొని వెళ్ళే అవకాశమున్నది. అహంకారాన్ని జయించి మానవుని శ్రేయస్సుగా అంతరార్థమూ ప్రతిధ్వనీ ఆవిర్భవిస్తున్నది కీర్తి కండూతి మూలంగా అర్జునుడు ఆచార్యుడైన ద్రోణుని ధర్మ సంకటంలోకి దించేశాడు. ఇక ఆచార్యుని అంతర్ క్షోభ హృదయ విదారకము. "పేరనెడి బింకమ్ము రక్తంపు పంకమ్ము" అనుట ద్వారా అశాంతి పరిహార భావనా శాంతి మార్గానుసరణామరక్తి మానవునిలో స్థిరముగా నెలకొనవలెనన్న ఆవేదన ద్రోణునిలో వెలుగుతున్న మణిదీపం.

'ఏకలవ్యుని కని అసూయ చెందినాడొ
ఆ నీచ హృదయుండు?'

అని ఆవేశితుడైన అశ్వత్థామలో ఒక స్వేచ్ఛావాది, సంస్కారి, లోక శుభంకర స్వభావము గల సహృదయుడూ కనుల ఎదుట నిలిచినాడు

అశ్వత్థామలోని మానవీయ భావన మానవ శ్రేయస్సును బలిపెట్టే సనాతన విధేయాన్నీ, కుసంస్కారాన్నీ కడిగి వేస్తున్నది. ఇతనిలోని పితృ వాత్సల్యమూ భక్తీ విశేషించి పేర్కొనదగ్గవి.

ఆ రాజసుతుల కూటికి కూలియై మీరు
నరక నక్రపు నోటికిచ్చుచుంటిరి మెడను

ఆవేదనతో కుపితుడైన అశ్వత్థామ ఆక్రోశిస్తూ పలికిన మాటలివి అశ్వత్థామలోనివి అపరిపక్వ భావనలని చెప్పి కవి ఒక ఉన్నతాదర్శముపైపు పాఠకుని లాక్కుపోగలుగుతున్నాడు, సమగ్ర తత్త్వము నెరిగిన వాడెవ్వడూ పాక్షిక దృష్టికి గురి కాలేడని అవగతమవుతున్నది.

'ఆ సచ్చిదానందమె జగద్గురువు,
సుమీ గురువు....నిమిత్తమాత్రుండు.'

అన్న ఈ పాదాల ద్వారా ద్రోణుని యొక్క నిరాడంబర తత్వము ప్రకాశమాన మవుతున్నది.

మాతృహృదయ సంక్షోభము, ఆచార్య హృదయ సంవేదనము, ఏకలవ్య గురుభక్తి ఉత్తమోత్తమమైన తీవ్రభావములు. విధి ఒక్కటే అత్యంత శక్తిమంతమైనదన్న సత్యం అడుగడుగునా పరితను కలచివేస్తున్న దనవచ్చును.

భారతీయ జీవన విధాన ప్రతిఫలనము కావ్యాంతర మణి ప్రభగా దీపిస్తున్నది. ఇది ఆనందమూ, హితవూ జోడు గుళ్ళముల వలె పరుగులెత్తుచున్న సహృదయరంజక శేఖరీభూత మణికిరీటమై ప్రకాశిస్తున్నది. ఈ పద్య నాటకమును అనువదించిన శ్రీ శంకరగంటి రంగాచార్యులకూ, డా॥ కె. వి. పుట్టప్ప గారికీ "భారతి"కి శుభాశంసనములు.

**శ్రీ పాతూరి రఘురామయ్య**

# గ్రంథ విమర్శలు

## భారతీయ సాహిత్య నిర్మాతలు

కేంద్ర సాహిత్య అకాడెమీ "భారతీయ సాహిత్య నిర్మాతలు" అనే శీర్షిక క్రింద, వివిధ భారతీయ భాషల కవి, పండితుల రచనలను సామాన్య పాఠకులకు పరిచయం చేసేందుకు, నిపుణులతో క్లుప్తంగా వ్రాయించి తక్కువ ధరతో అన్ని భాషల లోనూ ప్రచురిస్తున్నది. అట్టి పుస్తకాలలో ఈ క్రింది మూడు పుస్తకాలు చేరుతవి.

ఈ మూడు పుస్తకాలూ సాహిత్య అకాడెమీ, న్యూఢిల్లీ ప్రచురణలు. దొరుకుచోటు: సాహిత్య అకాడెమీ, రవీంద్రభవన్, న్యూఢిల్లీ - 110 001.

### 1 మహర్షి దేవేంద్రనాథ్ టాగూరు

[ఇంగ్లీషు మూలం : నారాయణ చౌధురి; తెలుగుసేత: రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, డెమ్మీ 1/8, 72 పుటలు, వెల: రూ. 5/-]

మహర్షి దేవేంద్రనాథ్ టాగూరు - పందొమ్మిదవ శతాబ్దంలో వంగదేశ సాంఘిక, సాంస్కృతిక రంగాలలో ప్రముఖ పాత్ర వహించిన మూడు బెంగాలీ కుటుంబాలలో టాగూరు కుటుంబ మొకటి. టాగూరులు "బెనర్జీ" (వంద్యోపాధ్యాయ) అనే బెంగాలీ బ్రాహ్మణులు. టాగూరు ("ఠక్కూర") అనేది గౌరవ వాచకం. విద్యాపతి ఠక్కూరుడే. "వేణీ సంహార" నాటక కర్త భట్టు నారాయణుడు టాగూరుల పూర్వీకుడంటారు. మన గ్రంథం దేవేంద్రనాథ టాగూరు తండ్రి "రాజా" ద్వారక నాథ టాగూరుతో మొదలు పెట్టుతుంది. "రాజా" బిరుదు మొగలు చక్రవర్తి ఇచ్చింది. రామమోహనరాయ్‌కీ, రాధాకాంత దేవ్‌కూ "రాజా" బిరుదుంది. ద్వారకనాథ టాగూరు పెద్ద జమీందారు. కుంఫిణీ వారి క్రింద పెద్ద ఉప్పు ఉద్యోగి. పైగా పరిశ్రమ, వ్యాపారం చేసి కోట్లు సంపాదించినాడు. ఆయన మరణంతో బ్యాంకు మునిగిపోయింది. పరిశ్రమ, వ్యాపారాలు దివాలా తీసినాయి. కొడుకు దేవేంద్రనాథుడు కోటి రూపాయల అప్పునకు వారసుడైనాడు. ఒక్క దమ్మిడీ ఎగవేయకుండా (అట్లా చేసేందుకు ఎన్నో చట్టపరమైన "కొలికి రంధ్రాలు"న్నా) దేవేంద్రనాథుడు అప్పంతయూ తీర్చినాడు. పురాణాలలో హరిశ్చంద్రుడు, చరిత్రలో ప్రసిద్ధ నవలాకారుడు సర్ వాల్టరుస్కాటు ఇట్లే బాకీలు తీర్చినారు. దేవేంద్రనాథుడు మత తాత్వికుడు. క్రైస్తవం వైపు మళ్ళే బ్రహ్మ సమాజాన్ని ఆర్ష ధర్మపక్షం తిప్పినాడు. క్రైస్తవ మతం స్వీకరించి బ్రహ్మ సమాజాన్ని ఫణీకు పట్టించే కేశవ చంద్రసేనుని ఆగ్రహానికి గురైనాడు. ఈ కేశవ చంద్రసేనుడే మన దేవేంద్రనాథునకు "మహర్షి" అనే సార్థక బిరుదు నిచ్చినాడు. ఈ కేశవచంద్రుడే విశ్వనాథవారి "వేయి పడగలు" నవలలో "కేషబ్జీ" అనే పేరుతో పేర్కొనబడినాడు. దేవేంద్ర నాథుని రచనలు ఉపనిషత్తుల తత్వాన్ని బోధించుటకు వ్రాసినవి. ఎప్పుడూ హిమాలయాలను దర్శించే దేవేంద్రుడు ప్రకృతి సౌందర్య పిపాసి. వర్డ్స్‌వర్త్ కవివలె ప్రకృతిలో భగవంతుని దర్శించిన వేదాంతి "(పాన్‌థీయిస్టు") అసలుకు "ఈశావాస్య మిదం సర్వం" అనే ఈశావాస్యోపనిషన్మంత్రమే కదా దేవేంద్ర నాథుని జీవన విధానాన్నీ, దృక్పథాన్నీ మార్చివేసింది! ఇప్పు డందరూ సర్వే సర్వత్రా "కోటు" చేసే-సినిమా పేరుగ కూడ చెలామణి అయిన "సత్యం శివం సుందరం" అనే సమాసం ఎక్కడిదనుకొన్నారు? ఉపనిషత్తులా? ఆదిశంకరుని "సౌందర్య లహరి"యా? తంత్రశాస్త్రములా? కాదు ఈ వాక్యం దేవేంద్రనాథ టాగూరు తన రచనలలో తానే సృష్టించినాడు. కీట్సు కవి సత్యం-సుందరం అన్నాడు. (ఓడ్ ఆన్ ఎగ్రీషియన్ అర్న్" అనే కవితలో. దేవేంద్రనాథుడు) భారతీయ దృక్పథంతో "శివం"ను మధ్య చేర్చినాడు. కావ్య ప్రయోజనం "శివేతర క్షతి" కదా! దేవేంద్రనాథుడు "శాంతినికేతనం" స్థాపించినాడు.

భారతీయ సంస్కృతికి దేవేంద్రనాథు డిచ్చిన కానుక విశ్వకవి రవీంద్రుడే. రవీంద్రునికి ఇన్స్పిరేషనిచ్చిందీ, రవీంద్రుని రచనలకు పూర్వరంగం సిద్ధం చేసిందీ, తండ్రి దేవేంద్రనాథుడే. దేవేంద్రనాథుడు కుటుంబ నియంత్రణ చేసికొని ఉన్నట్లయితే, ఆయన పదహైదు సంతానాలలో పదునాల్గవవాడైన రవీంద్రుడుండేవాడు కాదు. భారతీయ ఐ. సి. యస్. ఆఫీసరులలో మొదటివాడైన సత్యేంద్రనాథ టాగూరు (దేవేంద్రనాథ టాగూరు మొదటి సంతానం) మాత్రమే దక్కేవాడు. ఒక దృష్టిలో రవీంద్రుని కంటే తండ్రి దేవేంద్రుడే గొప్పవాడని చెప్పవచ్చును.

దావనున్న మునలివారు, నదీ గీటిలో పరుండి మరణించే "అంతర్జలి" అనే ప్రాచీనాచారాన్ని దేవేంద్రుని అవ్వ అనుస రించినట్లు గ్రంథంలో ఉంది (పు-11) ప్రాచీన కాలంలో విద్ధ లను నీటిలో కనడం అనే పద్ధతి కూడా ఉండేది. దీనికి కూడ "అంతర్జలి" అనేవారు. "ఉత్తర రామచరితం"లో శ్రీరాముడు సీతతో అంటాడు "అంతర్జలే ప్రసూతాసి రఘువంశధరౌ సుతౌ" (అంకం-7, శ్లో-35) రఘు వంశధరులైన సుతులను నీటిలో కంటివి అని అర్థం. నీట చస్తే పుణ్యం, నీటబుట్టితే అభ్యుదయం అని విశ్వాసం ఉండేది. దేవేంద్రనాథుడు చక్కని గీతాలు వ్రాసి నాడు. 60వ పుటలో ఇచ్చిన "కేన భూలో చిర సుహృద్" అనేదాని తెలుగు అనువాదం ఒక మచ్చు. ఇది బాల్య కాల స్నేహితుని మరచిపోవరాదంటుంది. ఈ గీతం స్కాటిష్ జాతీయకవి రాబర్ట్ బర్న్స్ (క్రీ.శ 18-19 శతా) ఒక జానపద గీతంపై ఆధారపడి వ్రాసిన "అవుల్డ్ లాంగ్ సైన్" అనే పాటను చాల దగ్గరగా పోలుతుంది బర్న్స్ గేయానికి తెలుగు అనువాదాన్ని 1983 జూన్ "భారతి" పత్రికలో "బహుకాల దర్శనం" అనే శీర్షికతో అనువదించినాను. (చూ "మానవాత్మలో సమసమాజం" వ్యాసం). మొత్తానికి మహర్షి దేవేంద్రనాథ్ టాగూరు చరిత్ర చక్కని గ్రంథం రాచపాళెం చంద్రశేఖరరెడ్డి తెలుగు అనువాదం సాఫీగా సాగింది. కానీ, బెంగాలీ పేర్లను ఇంగ్లీషు స్పెల్లింగ్‌ల ద్వారా తెలుగులోకి తెచ్చేటప్పుడు ఇంకా కొంత జాగ్రత్త అవసరం. "మతపిచ్చోణ్ణి" అనేది (పుట-25) మతోన్మాదిని అని వుంటే బాగు "ఇవ్వమని", "తీర్చమని" వంటి వ్యతిరేకార్థకాలు పరిహార్యాలు "పండ స్థాయి"(పుట-43) అనేకంటే "ఆరంభ దశలో" అంటే సరిపోతుంది. సాంకేతికమూ, సృజనాత్మకమూ, హాస్యోత్పాదకమూ కాని కేవల విషయ కథనాత్మక రచనలలో యథాతథానువాదం అవసరం లేదు. పుస్తకం అట్టపై దేవేంద్రనాథ టాగూరు చిత్రం బాగుంది. పుస్తకం చివర "మహర్షి జీవితంలో ముఖ్యమైన తేదీలు. సంఘట నలు" సమంచిత గ్రంథసూచి ఉపయోగకరంగా ఉన్నాయి.

## 2. జయదేవుడు

[ఇంగ్లీషు మూలం : సునీతకుమార చటర్జీ, తెలుగుసేత: బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు, డెమ్మీ 1/8, 84 పుటలు, వెల రూ. 5/-].

"జయదేవుడు" - ఇతని గురించి చాలా తెలిసినా, అంతా వివాద, సందేహాస్పదం. మిథిలవారు బెంగాలీలు. ఒరిస్సావారు జయదేవుడు తమవాడంటారు. ఊరేది? కేందు బిల్వమా? బిందు బిల్వమా? జయదేవు లెంతమంది? "గీత గోవిందం", "ప్రసన్న రాఘవ" నాటకం, "చంద్రాలోక"మనే ఆలంకారిక గ్రంథం కర్తలు వేర్వేరని ఇందున్నది. మన జయదేవుడు "గీత గోవింద" కవి. ప్రస్తుత గ్రంథం దాన్నిగురించే. "గీత గోవిందం"లో 24 అష్టపదులు, 12 సర్గాలలో విస్తరిల్లిన 386 శ్లోకాలు కలవు. నిర్మాణంలో కావ్యం గేయనాటకం. మన యక్షగానం లాంటిది. అష్టపదులు 8 పాదాలు కల పాటలు. ఇందు సంభాషణలు, సంబోధన లుంటాయి. శ్లోకాలు కథనా ప్రధానాలు. "గీత గోవింద" ప్రఖ్యాతంతా ఈ 24 అష్టపదులపైననే ఆధారపడుంది. గేయ నాటకాన్ని "లిరికల్ డ్రామా" అని "ఒపెరా" అనీ కూడా అంటారు. ప్రపంచ సాహిత్యంలోనే గీత గోవిందం మొట్ట మొదటి గేయ నాటకం తరువాత 16వ శతాబ్దంలో ఇటలీలో ఒపెరా వచ్చింది ఇంగ్లీషు కవి స్విన్ బర్న్ (1865), "అటలాంటా ఇన్ కాలిడాన్" అనే గేయ నాటకం వ్రాసినాడు. గీతగోవింద ఇతివృత్తం రాధామాధవుల శృంగారం. భాగవత, విష్ణు పురాణాలలో సత్యభామ నాయిక. రాధోపనిషత్తు, బ్రహ్మ వైవర్త పురాణంలో రాధ పేర్కొనబడింది. తెలుగులో ముద్దు పళని "రాధికా సాంత్వన" మనే ప్రబంధం వ్రాసింది. ఎల్లయ అనే కవి "రాధామాధవ" కావ్యం వ్రాసినాడంటారు. ఈ రాధా మాధవుల శృంగారం మూడు స్థాయిలలో చూడవచ్చును. లౌకిక సంభోగ శృంగారం, దివ్య ప్రణయం, ప్రకృతి-పురుషుల, జీవ బ్రహ్మల ఐక్య ప్రతీక. జీవులు నాయికలు. కృష్ణుడు నాయకుడు. భక్తుని, భగవంతుని సంబంధం స్త్రీ పురుషుల భార్యాభర్తల ప్రేమ సంబంధం. ఇట్టి భక్తి "పరమప్రేమ రూపా" అని నారదభక్తి సూత్రములంటుంది. ముస్లిముల సూఫీ(తసవ్వుఫ్)ప్రకారం భక్తుడు "ఆషిక్ అనే పేరుతోడి ప్రియుడు భగవంతుడు "మషూకా" అనే పేరుతోడి ప్రేయసి ఈ పద్ధతి హిందువుల శృంగారభక్తికి భిన్నంగా ఉంది. వేదాంతంలో భక్తుడు ప్రేయసి, భగవంతుడు ప్రియుడు. ఉమర్ ఖయ్యాం రుబాయత్తులలోని "నీవు", ప్రేయసి అయిన భగవంతుడే. బైబిలులోని "సాలమన్ గీత"లో శృంగారభక్తి వుంది. సాలమన్ - షూలమైట్‌లు నాయక నాయికులు. ఈ శృంగార భక్తిని, దైవీయ ప్రణయాన్ని "మధుర భక్తి" అంటారు. శృంగారమైన భక్తి కనుక మధుర భక్తి అనుకొనవలెను. దీనికి మధురభక్తి అని పేరు రావడానికి ప్రామాణిక వాక్యం ఏదైనా ఉందా? ఉక్తివైచిత్రి మాధుర్య మన్నాడు వామనాచార్యుడు. సాహిత్యంలో "స్వీట్‌నెస్"

(మాధుర్యం), "శైలు" (కాంతి) అన్నాడు మేథ్యూ ఆర్నాల్డ్. భక్తిలో మాధుర్యమేమిటి? వల్లభాచార్య కృత "మధురాష్టకం"లో "మధురాధిపతేః అఖిలం మధురం" అనే పల్లవి వస్తుంటుంది. శ్రీకృష్ణునిదంతా తియ్యన అని అర్థం. జయదేవుని "గీత గోవిందం"లో చివరలో ఈ శ్లోకం ఉంది.

"సాధ్వీ మాధ్వీక! చింతాన భవతి భవతశ్శర్కరే కర్కశాసి ద్రాక్షే! ద్రక్ష్యంతి కే త్వామమృత! మృత మసి క్షీర! నీరం రసస్తే మాకంద! క్రందకాంతా ధర ధర! సతులాం గచ్ఛ యచ్ఛంతి భావం యావచ్ఛృంగార సారం శుభమివ జయదేవస్య వైదగ్ధ్యవాచః

గీత గోవిందం, సర్గ-12, శ్లో-12)

లోకంలో ఏయేవి తియ్యనివి (ఇప్ప పూదేనె, చక్కెర, ద్రాక్ష, అమృతం, మామిడి, కాంతల అధరోష్ఠాలు) కలవో, వాటి కేదోనొక లోపం ఉంటుంది. కావున అవి నిస్సారములు అని జయదేవుడు వానిని తీసివేస్తాడు. జయదేవుని చతురవాక్కులు మాత్రమే మంగళదాయక శృంగార రససారము నందిస్తాయి అని దీని అర్థం. అంటే జయదేవుడు వర్ణించిన రాధామాధవుల శృంగారమే మధుర రససారం. ఇది జయదేవుడు నిర్వచించిన మధుర దివ్యశృంగారం. శ్రీకృష్ణునికీ, భక్తునికీ గల నాయక (పురుష), నాయిక (స్త్రీ) సంబంధానికే "మధురభక్తి" అనే పేరు వచ్చింది అని జయదేవుడు నిర్దేశించినాడని మనం తెలుసుకోవలెను. "మధురభక్తి" అనే పేరు రావడానికి జయదేవుని శ్లోకమూ, వల్లభాచార్యుల "మధురాష్టకము" ప్రమాణాలు. "గీత గోవిందం"పై విమర్శలు లేకపోలేదు. అందు గీతయే కానీ గోవిందుడు లేడు. అంటే విష్ణువు లేడనేది ఒకటి. శబ్ద మాధుర్యమే కాని అర్థ గాంభీర్యం లేదనేది ఇంకొకటి. శృంగారం "పచ్చి"గా ఉందనేది మరొకటి. విద్యాపతి (మైథిలి), చండీదాసు (బెంగాలీ), నమ్మాళ్వారు (తమిళం), మీరాబాయి, (హిందీ, రాజస్థానీ)ల శృంగార పదాలలోని మధురభక్తి యందలి ఉదాత్తత "గీత గోవిందం"లో లేదని వాదం. "గీత గోవిందం" రాధా మాధవుల ప్రణయగాథే కానీ జయదేవుని భక్తి మొర కాదు. రాధామాధవులు దివ్య ప్రేమికులు కావున జయదేవుడు భక్తి పుర స్పరంగా ఆ ప్రేమను గానం చేసినాడు. పైగా అది నాటకం కూడ. రాధ, కృష్ణుడు, సఖి మున్నగు పాత్రలు మాట్లాడుతారు. ఇచ్చట భక్తులు భూలోకంలోని మనుషులు. నిజంగా ఉన్నవారు. వీరి దేవుడు కృష్ణుడు, అదృశ్యుడు. వీరికి దేవునిపై గల వి ప్లేటోనిక ప్రేమ. వీరు భగవంతుని కోరేది ఊహాగత ఉదాత్త కృత అమలిన విరహ శృంగారం. ఆధ్యాత్మ ప్రేమ ఈ దౌర్భాగ్యస్థితి రాధామాధవుల కెందుకు పట్టింది? వారు సమ స్థాయులు. సమకాలికులు. అందుకే వారిది భౌతిక ప్రేమ ఈ దృష్టితోనే జయదేవుడు గీత గోవిందంను రాధాకృష్ణుల సంభోగ శృంగారంతో సుసంపన్నం చేసినాడు. జయదేవునీ, అతని పత్ని పద్మావతినీ శ్రీకృష్ణుడు, రాధ అనుకొనే విశ్వాసం కల కథ ప్రచారంలో కలదు. ఈ కథను చెప్పుకొంటూ శ్రీకృష్ణభక్తులు (ముఖ్యంగా బెంగాలులో) మురిసిపోతుంటారు "గీత గోవిందం"కు గల ప్రశస్తి తక్కిన ఏ కృష్ణ కావ్యానికీ లేదు.

పుస్తకం అట్టపై నల్లని ఉపరితలంపై తెల్లని రేఖలతో ఒక వేణుధారి, ఒక యువతి ముఖచిత్రం (శ్రీకృష్ణ రాధలకు ప్రతీక), లోపల బెంగాలులోని రాజషాహి జిల్లాలో పహార్‌పూరు నందు దొరికిన 6-7 శతాబ్దాలనాటి రాధాకృష్ణుల శిల్ప చిత్రమూ ముచ్చటగొల్పుతూ ఉన్నాయి.

"జయదేవుడు" ఒక చిన్న గొప్ప పుస్తకం.

## 3. నమ్మాళ్వారు

[ఇంగ్లీషు మూలం: ఆ. శ్రీనివాస రాఘవన్, తెలుగుసేత: చల్లా రాధాకృష్ణశర్మ, డెమ్మీ 1/8, 109 పుటలు, వెల: రూ. 5/-]

"నమ్మాళ్వారు"-శ్రీ వైష్ణవమతంలో 12 మంది ఆళ్వారు లున్నారు. అందులో నమ్మాళ్వారు ఒకడు. "ఆళ్వారు" అంటే "మునిగినవాడు" (భక్తిలో మునిగినవాడు) అని అర్థమని రచయిత పుస్తకంలో చెప్పినాడు. నాకనిపించేదేమంటే, "ఆళ్వారు" అంటే రక్షించేవాడు, పరిపాలించేవాడు అని అర్థం. యాము నాచార్యునికి "ఆళవందారు" అని పేరుంది. ఆళ=రక్షించుటకు, వందారు=వచ్చినవారు. కన్నడ భాషలో కూడ "ఆళు" అంటే

రక్షించు, పరిపాలించు అనే అర్థం, ఈ [illegible] "ఏలు" అయింది. "ఏలువారు", "ఏలినవారు" అంటే రాజు. ఆళ్వారు లేదా విష్ణుభక్తిని ప్రచారం చేసి, శరణాగతి పద్ధతిని మోక్షమార్గంగా ప్రతిపాదించిన వైష్ణవులు. 5-9 శతాబ్దాల మధ్య ఉండినవారు. వీరిలో గజదొంగనుండి మహారాజు స్థాయి వరకూ ఉన్నారు. ఇట్టివారిలో నమ్మాళ్వారు ఒకరు. నమ్మాళ్వారు అంటే మన ఆళ్వారు అని ఆప్యాయార్థం. సంస్కృతంలో ఈయనకి పరాంకుశ ముని, శఠగోప యతి అని పేర్లు కలవు. విద్య లేదు. పదహారేండ్లు మౌనం వహించినాడు. మధురకవి ఆళ్వారు వేసిన ఒక ప్రశ్నకుత్తరం ఈయడానికి మాట్లాడవలసి వచ్చింది. ఇక ఆగింది లేదు. నాల్గు కృతులు వ్రాసినాడు. 1) తిరువిరుత్తం, 2) తిరువాసిరియం, 3) పెరియ తిరువందాది, 4) తిరువాయ్‌మొళి. నమ్మాళ్వారు ఆధ్యాత్మిక స్థాయి ఎట్టిదంటే, దేవతలే ఆయనున్నచోటికి వచ్చి దర్శనమిచ్చి పోయేవారట. ప్రజల భాష అయిన తమిళంలో విష్ణు పారమ్యాన్ని గానం చేసి, జైన, బౌద్ధాలను ద్రవిడ దేశం నుండి తరిమివేసినవారు ఆళ్వారులు. పండ్రెండు ఆళ్వారుల కృతులకు పాశురములని పేరు. మొత్తం 4 వేలకు పైగా పాశురములు కలవు. వీటన్నిటికీ కలిపి "నాలాయిర ప్రబంధం" అని పేరు. ఈ ప్రబంధానికి ద్రవిడ వేదమనే కీర్తి ఉంది. ఆళ్వారుల భక్త్యావేశంతో పోలిస్తే గజేంద్రుడు, ప్రహ్లాదుడు మున్నగు విష్ణుభక్తులు పాలిపోతారు. నమ్మాళ్వారు వ్రాసిన తిరువాయ్‌మొళి అతి ముఖ్యమైనది. పెద్దది. తిరువాయ్‌మొళి అంటే పవిత్రవాక్కు అని అర్థం. ఇందులో 1102 పాశురములు కలవు. నాలాయిర ప్రబంధంలో నాల్గవభాగం తిరువాయ్‌మొళే.

నమ్మాళ్వారు తన పాశురములలో నారాయణ, కృష్ణ, విష్ణు పారమ్యాన్ని, మధురభక్తిని, శరణాగతిని ప్రతిపాదించినాడు. ఈయన మధురభక్తి అతి స్వచ్ఛంగా, విప్రలంభ శృంగారంగా ఉంటుంది. తననే నాయికగా, విష్ణువే నాయకునిగా నిరూపిస్తాడు. ఇదీ ప్లేటోనిక ప్రేమ అంటే ప్రియమైన అమలిన శృంగారం. నేను తెలుగు అర్థ తాత్పర్యాల సహాయంతో తిరువాయ్‌మొళి 1102 (తమిళ మూలం, తెలుగు లిపిలో) పాశురాలు చదివినాను. [illegible]ం రాకపోయినా, మూల పాశురాలలోని తన్మయీ భావం, భక్తి, పదలాలిత్యం అద్భుతం అనిపించినాయి.

ప్రస్తుత గ్రంథంలో నమ్మాళ్వారు పాశురాల విస్తార తెనుగు అనువాదాలిచ్చినారు. సులభ గ్రాంథిక భాషలో, వచన పద్యరూపంలో తెలుగు అనువాదాలు సూటిగా సులభ బోధకంగా ఉన్నాయి. నమ్మాళ్వారు "తిరువిరుత్తం"లో ఒక పాశురంలో మధురభక్తి ద్వారా విష్ణువుతో కలిసిపోవలెననే తపనను తెలిపే అనువాదం ఇట్లా వుంది.

"లక్ష్మిని, భూదేవిని, రాధను" (పుట-16) దీనికి అధోజ్ఞాపిక వివరణలో "రాధకు తమిళ సంప్రదాయంలో నప్పిన్నై అని వ్యవహారం. కృష్ణావతారంలో ఆమె దేవుని ప్రేమ పొందింది". దీనినిబట్టి అనువాదంలో "రాధ" అని ఉన్నచోట మూల పాశురంలో "నప్పిన్నై" అని వుందని మనం అనుకోవలసి వున్నది. ఈ అధోజ్ఞాపికలోని వివరణను మూల రచయిత శ్రీనివాస రాఘవన్ ఇంగ్లీషు మూలంలో ఇచ్చిందో లేక తెలుగు అనువాదకుడు తెలుగులో ఇచ్చిందో తెలియదు కానీ ఈ వివరణ సరికాదు. తమిళ సాంప్రదాయంలో నప్పిన్నాయ్ అంటే నీళాదేవి. పాశురాలలో గోపికాస్త్రీలా వస్తుంటారు. "ఆథ్రవణాంగనానాం" అని నారదభక్తి సూత్రం. రాధ గోపిక రాదు. శ్రీకృష్ణుడు నీలాదేవిని పెండ్లియాడెను. (చూ. కూచిమంచి తిమ్మకవి "నీలా సుందరీ పరిణయము") శ్రీరంగనాథుని పెండ్లాడిన "దాల్చిన మాల్యమిచ్చు నప్పిన్నది "నప్పిన్నయి" అనేదే సరైన పాఠమని నా భావం.) అయిన ఆడు ఆళ్వారు గోదాదేవి తన "తిరుప్పావు"లో "నప్పిన్నయి"ని చాలాసార్లు స్మరిస్తుంది. తానే నప్పిన్నయి అని గోదాదేవి నమ్మిక. శ్రీభూనీళలు అని ఒక్క బిగిలో పల్కుతాము. వీరు విష్ణు దేవేరులు. రాధ స్థానం వేరు. రాధ శ్రీకృష్ణుని హ్లాదినీశక్తి. నమ్మాళ్వారు ప్రస్తుత పాశురంలోని నప్పిన్నాయి నీళ కావున ఆ పాశురాన్ని ఈలాగు తిరిగి వ్రాయవలెను.

"లక్ష్మిని, భూదేవిని, ఆనీళను"

అట్టమీద నమ్మాళ్వారు బొమ్మ విచిత్రంగా ఉంది.

సర్దేశాయి తిరుమలరావు

Printed & Published by S. Radhakrishna for Nageswara Rao Estates Ltd., at the Andhra Patrika Press. Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247 .